# మయూర సంస్కృతి

శ్రీమయూరుని సూర్యశతకమునకు గద్యపద్యానుకృతి

"శాంతిశ్రీ"

జంధ్యాల వేంకటేశ్వర శాస్త్రి

ప్రశాంతి నిలయం

ప్రథమ ముద్రణము :
ప్రతులు వెయ్యి



ఆర్షధర్మ ప్రచారకులైన తిరుమల తిరుపతి దేవస్థానములవారి
ఆర్థిక సహాయముతో ప్రచురింపబడినది

ప్రతులకు :

1. జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి
పుట్టపర్తి - ప్రశాంతినిలయము
అనంతపురంజిల్లా

2. నవోదయ పబ్లిషర్స్
విజయవాడ-2

వెల : రూ 30

55520

ముద్రణ :
చైతన్య ప్రింటర్స్
డా॥ రామచంద్రరావురోడ్డు, సూర్యారావుపేట
విజయవాడ-2



భగవాన్ శ్రీ సత్యసాయి చరణ కమలములపై
ఈ కృతి సమర్పితము

—శాంతిశ్రీ

బాబా

# నవమల్లికలు

డాక్టర్. కరుణశ్రీ

స్వామి నొక్కమాటు సంస్మరించిన చాలు
వెండికొండ నవ్వుచుండినట్లు
గుండెలోన శివుడు తాండవించినయట్లు
నిత్య శాంతిదాయి ! సత్యసాయి !

సాయిమాత ఒక్కసారి నవ్విన చాలు
సురలు విరులవాన కురిసినట్లు
నవ వసంత లక్ష్మి నాట్యమాడినయట్లు
నిత్య శాంతిదాయి ! సత్యసాయి !

ప్రభువు పెదవి విప్పి పలుకరించిన చాలు
ముగ్ధ మధుర మురళి మ్రోగినట్లు
సరస రాగలహరి జాలువారినయట్లు
నిత్యశాంతిదాయి ! సత్యసాయి !

కృతిపేరు "మయూర క్రేం
కృతి" "శాంతిశ్రీ" బుధాళి కిడు నూత్న బహూ
కృతి; "సూర్య శతకము"న కను
కృతి; వెలుగుత జగతి ప్రగతి కిది జాగృతియై !

# శుభాకాంక్షలు

కళాప్రపూర్ణ
మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

సంస్కృత కవితా లోకమున సుప్రతీతమైన మయూరుని సూర్యశతకమునకు వ్యాఖ్యా సహితమైన ఆంధ్ర పద్యానువాదమును కావించిన శాంతిశ్రీ జంధ్యాల వేంకటేశ్వర శాస్త్రిగారు ఆధునిక కవితా లోకమున సుప్రసిద్ధులు: మయూరుని కవిత రసప్రౌఢమైనది. ప్రతి శ్లోకము గంభీర భావ సంభృతము. ఏతాదృశమైన మూలశ్లోకములకు అనుగుణమైన అనువాద పద్ధతిలో శాంతిశ్రీగారి సీసములు అర్థ భావ భాసురములై శోభిల్లుచున్నవి. సామాన్య పాఠకులకు అవగతమగు రీతిలో శ్లోక వ్యాఖ్య సాగినది. ప్రకృతము వ్యాఖ్య యొక్క అక్కర ఎంతేని కలదు.

అభౌతికమైన ఆధ్యాత్మిక మార్గమున ఆదిత్యునివలె భక్తుల చిత్తములకు దీప్తినిచ్చి నడపించుచున్న భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారికి ఈ కృతి సమర్పితము చేసిన శ్రీ శాస్త్రిగారు చరితార్థులు.

# సుమాంజలి

శ్రీ మయూర మహాకవి విరచితమైన "సూర్య శతకం" మహా మహిమోపేతం. ఇది ఆరోగ్య భాస్కరం. ఇది ఆనంద సంధాయకం. కవితా కల్యాణికి ఈ కృతి శ్రవణావతంసం. ఇది మయూర భావ పింఛం.

జయదేవుడు తన "ప్రసన్న రాఘవం"లో కవిస్తుతి యిలా చేశాడు.

యస్యాశ్చోర శ్చికుర నికరః కర్ణపూరో మయూరో
భాసో హాసః కవికుల గురుః కాళిదాసో విలాసః
హర్షో హర్షో హృదయ వసతిః పంచబాణస్తు బాణః
కేషాం నైషా కథయ కవితా కామినీ కౌతుకాయ !

చోరకవి కవితా కామినీమణి ముఖబింబాన్ని అందగింపచేసే ముంగురుల సోయగం వంటివాడు. మయూర మహాకవి కర్ణావతంసం, భాసుడు ఆమెకు మందహాసం, కవికుల గురువు కాళిదాసు ఆమె విలాసం, హర్షుడు హర్షమే, బాణుడు పంచబాణుడు సుమా ! అటువంటి కవిత ఎవరికిష్టం కాదు ?

కవితా వనితకు కర్ణావతంసంగా విరాజిల్లిన మయూర మహాకవి కాళిదాసాదులవలె కావ్యనాటకాదులను రచించినట్లు ప్రశస్తి లేదు. ఈయన రచించిన సూర్యశతకం ఒక్కటే ఈ కవిని అజరామరుణ్ణి చేసి వైచింది. సూర్యుడున్నంతకాలం సూర్యశతకం ఉంటుంది. మయూరుడు అమరుడై అందగిస్తాడు.

హర్షచరితం, కాదంబరి కృతుల్ని రచించిన బాణుడికి మయూరుడు మామగారని ఒక ఐతిహ్యం ఉన్నది. బాణమహాకవి

హర్షవర్ధనుడి ఆస్థానంలో ఉన్నట్లు చరిత్ర చెప్తున్నది. హర్షవర్ధనుడు ఏడవ శతాబ్దంలో రాజ్యపరిపాలన చేశాడు.

> అహో ! ప్రభావో వాగ్దేవ్యా
> యన్మాతంగ దివాకరః
> శ్రీ హర్షస్యా భవత్సభ్యః
> సమో బాణ మయూర యోః !

హర్షుని ఆస్థానంలో బాణుడు మయూరుడు కూడా కవి శేఖరులుగా విరాజిల్లినట్లు రాజశేఖరుని ఈ శ్లోకంవల్ల విదితమౌతున్నది:

> దర్పం కవి భుజంగానాం
> గతా శ్రవణ గోచరమ్
> విష విద్యేవ మాయూరీ
> మాయూరీ వాఙ్నికృంతతి !

కుకవి భుజంగాల దర్పాన్ని మయూరుని వాక్కు మాయూరి యనే విషహరణ మంత్రంవలె చెవి సోకగనే నశింప చేస్తున్నదనీ మరొక ప్రశస్తి. ఇలా మయూర మహాకవిని గురించి అనేక ప్రశంసా వ్యాక్యాలున్నాయి.

మయూర మహాకవి ఒకానొక కారణంవల్ల రోగ పీడితుడు కాగా ఆ రోగమునుంచి విముక్తి పొందటానికి మయూరుడు ఈ శ్లోకాలతో సూర్యభగవానుణ్ణి ఆరాధించాడని, ఇందుకు సూర్యుడు ప్రసన్నుడై మయూరునికి సంపూర్ణమైన ఆరోగ్యాన్ని ప్రసాదించాడని అంటారు.

ఈ మయూరుని సూర్య శతకం ప్రౌఢ కావ్యం. ఇందులో కవితా చమత్కారాలు కోకొల్లలు. అలంకారాల కలంకారీ తనాలు అనేకం. భావనా వైభవం అద్భుతం. ఒకే ఒక్క లక్ష్యభూతుడైన సూర్యుణ్ణి ఈ విధంగా శతాధిక ఊహాలతో భావన చేయటం ఆ..

మయూర మహా కవికే సాధ్యమయింది. ఆ మహా కవికి సహస్రాధి వందనాలు.

ఈ సూర్యశతకానికి పల్లభదేవాదులు వ్యాఖ్యలు వెల యించారు. శ్రీనాథుడు కొన్ని శ్లోకాలను తెలుగు చేసికొని తన కాశీ ఖండంలో చేర్చుకొన్నాడు. ఆధునికులలో ఆకొండి వ్యాసమూర్తి గారు, పడ్డాది సుబ్బారాయుడుగారు పద్యానువాదాలు చేశారు. పండిత ప్రవరులు విoజమూరి శేషఫణి శర్మగారు వ్యాఖ్యను వెలువ రించారు.

మయూరుని కృతిపై నాకూ మనసయింది. ఫలితంగా ఈ ఆకృతి ధరించింది. ఈ కృతికి "మయూర ప్రేంకృతి" అని నామకరణ ముంచాను. ఇది నాకు కూడా ఆరోగ్య భాస్కరమయింది. శక్తిలేక పోయినా ఏదో భక్తితో ఈ కృతిని వెలయించాను. ఒప్పులు మయూర మహాకవివి దోసగులు నావి అని వినమ్రతతో విన్నవిస్తున్నాను.

ఈ కృతికి శుభాశీస్సులను ప్రసాదించిన "కరుణశ్రీ" బాబాయి గారికీ, మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారికి హృదయ పూర్వకమైన అభివందనాలు.

ఈ పుస్తక ప్రచురణకు ఆర్థిక సహకారాన్ని అందించిన తిరుమల తిరుపతి దేవస్థానముల కార్యనిర్వహణాధికారిగారికి, సప్తగిరి సంపాదకులు సుబ్బారావుగారికి కృతజ్ఞతాభినందనలు.

"అరుణ"రాగ రంజితుడైన శ్రీ సత్యసాయి చరణ కమలా లపై ప్రేమతో ఈ కృతిని సమర్పిస్తున్నాను.

-శాంతిశ్రీ

# నా స్వామి !

నిను తలంచి మనస్సును నిలుపలేను
జప తపమ్ముల దీక్షతో సలుపలేను
లేనిగొప్ప పూసికొను అజ్ఞాని నేను
నన్ను కాపాడరా ! తండ్రి ! నళిననేత్ర !

కష్టసుఖములతోడి సత్కార్యపూర్ణ
జీవనఫలంబె నేను కాంక్షించు వరము
నిను ప్రతీక్షించు విరహ వేదనములోన
ఎన్ని జన్మమ్ములైన కాంక్షింతు దేవ !

ఇది మయూరమహాకవి కృతివరేణ్య
మిది మనోజ్ఞ మయూర క్రేంకృతియె నిజము
దీని నృత్యకళావీథి తెలియజెప్ప
ఏను జాలను ! సత్యసాయీరవీంద్ర !

నీ పవిత్ర శ్రీచరణ సాన్నిధ్యసీమ
చెదురుగా పూచినట్టి ఈ చిన్నిపూలు
నీవె - నీ పూజకర్పింతునో విధాయి !
సర్వలోకాతిశాయి ! శ్రీసత్యసాయి !
నాది ఏమున్నదోయి ! ఆనందదాయి !
దేవ ! కృతికర్త కృతిభర్త నీవె తండ్రి !

— శాంతిశ్రీ

# ఓం శ్రీ సాయిరాం

పూర్వభాగాన సూర్యుడు పొటమరించె
వర్షమేఘమ్ము పశ్చిమ ప్రాంగణాన
సప్తవర్ణాల ఇంద్రుని చాపమెత్తె
అందముగ మయూరమ్ము నాట్యమ్ముచేసె

జగతినిండిన 'వరుణమ్ము' సప్తరుచుల
అంధకారాసురులు పలాయనము చెప్ప
రవిమహారాజు భువనబాంధవుడు వచ్చె
కమలములు విచ్చె విప్రు లర్ఘ్యములనిచ్చె

సదయ బ్రహ్మస్వరూపమ్ము ఉదయవేళ
త్ర్యంబక స్వరూపమ్ము మధ్యాహ్నవేళ
మాధవ స్వరూపము మునిమాపువేళ
మూడు రూపుల దేవుండు ప్రొద్దువేల్పు

సూర్యభగవానుని-అనంత శౌర్యయుతుని-
పాపజీమూత పవనుని-దీపకరుని-
యోగవర్తిని-భవభయరోగహరుని-
కాలమూర్తిని-సకలప్రకాశకరుని-
ఆదిదేవుని-ప్రభువుని-ఆత్మవిభుని-
ఉత్సహించి భజింతు శుభోదయాన

# సూర్యప్రభలు

## 1. శ్లోకం

జంభారాతీభకుంభోద్భవమివ దధతస్సాంద్రసిందూరరేణుం
రక్తాస్సిక్తా ఇవౌఘైరుదయగిరితటీధాతుధారాద్రవస్య
ఆయాంత్యా తుల్యకాలం కమలవనరుచేవారుణా వో విభూత్యై
భూయాసుర్భాసయంతో భువనమభినవా భానవో భానవీయాః

### పద్యం

ప్రాచీన దిక్కాంత భద్రకుంభమ్ముపై
        తోరమై పొంగు సిందూరరజము!
ఉదయాద్రి గైరికాభ్యుత్థాన పరిపూర్తి
        రంజిత ధాతుధారా ద్రవంబొ!
వరణీయ బాలభాస్కర దీప్తితో వచ్చు
        అరవిందవనముల అరుణిమంబొ!
తూరుపు బంగారుతొయ్యలి నుదుటిపై
        కోర్కెమై చిందాడు కుంకుమంబొ!

నా ప్రవహించు భాస్కర సుప్రభాత
సత్య సౌందర్య దివ్య ప్రశాంతి కాంతి
వెలుగుచున్నది మన పుణ్యఫలము వోలె
అనుజ! పల్కుమా! వేగమ్ము స్వాగతమ్ము!

వ్యాఖ్య

శ్రీసూర్యనారాయణుడు దివ్యప్రభలతో ఉదయింపబోతు న్నాడు. ఆకాశంలో అరుణకిరణ కాంతులు అందంగా అద్భుతంగా అలముకొన్నాయి. విహంగాలు కిలకిలారావాలు చేస్తున్నాయి. ప్రకృతి పులకించిపోతున్నది. తూర్పు తెలతెలవారుతున్నది. శ్రీసూర్య భగవానుడు చిత్రాంబరుడై ఉదయిస్తున్నాడు. దేవతలు ప్రొద్దు వేలుపుపై పసుపు కుంకుమల వసంతం చల్లుతున్నారు.

అదిగో లోకబాంధవునికి లోకం స్వాగతం పలుకుతున్నది. ఇంద్రుని ఐరావత కుంభస్థలాలపైనుంచి సిందూరం పొంగి పొరలు తున్నది. ఆ కాంతులే కాబోలు ఆ అరుణకాంతులు. ఉదయ పర్వత సానువులందలి గైరికాది ధాతువుల నుంచి స్రవించే ద్రవ ధారలలో తడిసినందువల్ల కాబోలు ఆ సూర్యకిరణాలు రాగరంజితములై ప్రకా శిస్తున్నాయి. కమలబాంధవుడు వస్తున్నాడని కమల వనాలు ఒక్క- సారిగా పులకించి పుష్పించినాయి. ఆ పుష్పాల ఎఱ్ఱని కాంతివల్ల కాబోలు ఆ సూర్యప్రభలు ఎఱ్ఱబడి తళతళలాడుతున్నాయి. తూరుపు దిక్కు- అనే సుందరీమతల్లి ఫాలభాగంపై కుంకుమ తిలకమూ అన్నట్లు సూర్యుని అరుణవర్ణప్రభ అందగిస్తున్నది.

సూర్యభగవానుని తొలి బంగారు లేత కిరణాలు లోకానికి సన్మంగళాలు చేకూరుస్తున్నాయి. సకల విభూతుల నందజేస్తున్నాయి.

★ ★

"ఓమ్ తత్ సవితుః వరేణ్యమ్"

2. శ్లోకం

భక్తి ప్రహ్వాయ దాతుం ముకుళపుటకుటీకోటరక్రోడలీనాం
లక్ష్మీమాక్రష్టుకామా ఇవ కమలవనోద్ఘాటనం కుర్వతే యే
కాలాకారాంధకారానసపతితజగత్సాధ్వసధ్వంసకల్యాః
కల్యాణం వః క్రియాసుః కిసలయరుచయస్తే కరా భాస్కరస్య

పద్యం

ముకుళిత పంకజమ్ములలోన బందియౌ
ఇందిర చెరవిడిపించదలచి
ఆ సుందరీమణి నత్యంత హర్షాన
శ్రీవిష్ణుమూర్తి కర్పించ నెంచి
ముదముతో రాజీవ హృదయమ్ము విప్పగా
నీటుగా తగినఏర్పాటుచేసి
కారుచీకటివంటి చోరుల తెగటార్చి
జగతికి శ్రేయమ్ము నలుపగోరి

పచ్చనాకుల తోరణ పం క్తినుండి
అరుణకిరణాలు లోకాన బరపి నేడు
వచ్చుచున్నది దివ్య దివాకరార్చి
అనుజ! పల్కుమా! వేగమ్ము స్వాగతమ్ము!

## వ్యాఖ్య

సూర్యుడు తన భక్తుల్ని శ్రీమంతుల్ని చేద్దామని లక్ష్మీదేవి కోసం వెతకసాగాడు. ఈ వెదుకులాటలో సూర్యుడు కాస్త పసుపుగయ్యాడు. అంతలో అంధకారం వ్యాపించింది. కమలాలు ముడుచుకుపోయాయి. తిమిరాసురుడు లక్ష్మిని నళిన గుహల్లో బంధీ చేశాడు. లోకం చీకట్లో చిక్కై పోయింది.

జగచ్చక్షువు అయిన కమలబాంధవుడు లక్ష్మికి విముక్తి కలిగించటంకోసం వీర కంకణం ధరించాడు. ఉపకారానికి ఉపక్రమించాడు. ఆ క్షణమే అంధకారాసురులపై దండెత్తాడు. సహస్ర కిరణాలవంటి బాణాలు వేసి తిమిర సైన్యాన్ని పారద్రోలాడు. తిమిరం మటుమాయమయింది. లోకం ఖైదిని వదిలింది.

పద్మవనాలు వికసించాయి. లక్ష్మీదేవి కళకళలాడుతూ భక్తుల్ని కటాక్షించింది. విష్ణు వక్షస్థలంపై లక్ష్మీదేవి ప్రకాశించింది. భక్తులకై లక్ష్మిని విడిపించటం-భార్యాభర్తల్ని కలపటం అంధకారం హరించటం ఆర్తుల్ని ఆపదల్లో ఆదుకోవటం ఆదిత్యుడికి అతి సహజ గుణాలు.

లోకమంతా ఉత్సాహ కాంతులు వెల్లివిరిశాయి. మంగళ తోరణాలు ద్వారాలపై మిలమిలలాడాయి. మామిడి చిగురాకు తోరణ కిరణాలు దశదిశలా వ్యాపించాయి. దేవాలయాలలో మంగళతూర్య నాదాలు మారుమ్రోగాయి. స్వామి దర్శనమిచ్చాడు. జగత్తుకు మంగళం కలిగింది.

 

"సమస్త సన్మంగళాని భవంతు"

### 3. శ్లోకం

గర్భేష్వంభోరుహాణాం శిఖరిషు చ శిఖాగ్రేషు తుల్యం పతంతః
ప్రారంభే వాసరస్య వ్యుపరతిసమయే చైకరూపా స్తథైవ
నిష్పర్యాయం ప్రవృత్తాస్త్రిభువనభవనప్రాంగణే పాంతు యుష్మా
నూష్మాణం సంతతాధ్వశ్రమజమివ భృశం బిభ్రతో బ్రధ్నపాదాః

### పద్యం

సుందర సుకుమార సూక్ష్మాతిసూక్ష్మమౌ
పద్మాంతరంగాన ప్రతిఫలించి
కఠినాతికఠిన శుష్క మహాద్రి శిఖరాగ్ర
భూముల సంచారముల నొనర్చి
ఉభయసంధ్యలలోన ఒక్కరీతిగ మంగ
ళారుణప్రభలలో పరిమళించి
ముల్లోకములముందు ముద్దులుగారగా
పద్మరాగాలు నింపారబోసి

అమిత దీర్ఘప్రయాణాల శ్రమలకోర్చి
వెచ్చవెచ్చని ఊర్పుల పెచ్చురేగి
ఉష్ణమెక్కుడైవచ్చె సూర్యుని వెలుంగు
అనుజ! పల్కుమా! వేగమ్ము స్వాగతమ్ము!

వ్యాఖ్య

అవిగో! చిత్రభానుని విచిత్ర కిరణాలు. అవి కిరణాలు కావు పద్మబాంధవుని పవిత్ర పాదాలు. ఆ కిరణాలు శుభములకు ఆవిష్కరణాలు. ప్రకృతికి అలంకరణాలు. ఇవి చాలా శక్తిమంతాలు. భక్తి భరితాలు. వీటి స్వభావం చాలా చిత్రంగా ఉంటుంది.

ఇవి అతి సుకుమారమైనవి అంతేకాదు కఠినాతికఠినమైనవి. పద్మాల హృదయాలలో జొరబడి ఆనందం అందించి చక్కిలిగింతలు పెడతాయి. పర్వత పాషాణ చిత్తాల్లోనూ ప్రవేశించి చైతన్యాన్ని కలుగజేస్తాయి.

ఇవి ఉదయ వేళల్లో అభ్యుదయకరంగా హాయిగా నులి వెచ్చగా తాకుతాయి, ఆహ్లాదాన్ని అందిస్తాయి. ఇవి నిరంతరం మండుటాకాశంలో శ్రమించి శ్రమించి గమించటంవల్ల వేడెక్కిపో తుంటాయి. మధ్యాహ్నవేళల్లో మానవులలోని మగత వదిలిస్తాయి. మళ్ళీ సాయంకాలం సరస వీచికల్ని ప్రసరింపజేస్తాయి. ఉభయ సంధ్యల్లోను ఒకే విధంగా సువర్ణ సువిలసితాలై ప్రకాశిస్తాయి. అరుణారుణ రాగరంజితాలై ఆనందం అందిస్తాయి. త్రిభువన భవన ప్రాంగణాల్లో చలువపందిరి వేసి మంగళ తోరణాలు కడు తుంటాయి.

సూర్యదేవుని పాదపద్మములైన ఈ కిరణాలకు ప్రణామాలు!

★ ★

"మంగళం మహత్"

### 4. శ్లోకం

ప్రభ్రశ్యత్యుత్తరీయత్విషి తమసి సముద్వీక్ష్య వీతావృతీన్ ప్రా
గ్జంతూ స్తంతూన్యథా యానతను వితనుతే తిగ్మరోచిర్మరీచీన్
తే సాంద్రీభూయ సద్యః క్రమవిశదదశాశాదశాళీవిశాలం
శశ్వత్సంపాదయంతోఽంబరమమలమలం మంగళం వో దిశంతు

### పద్యం

రాత్రికాలమ్మునన్ ప్రజలు చీకటిపంటి
    దుప్పటి నిండుగా కప్పుకొనిరి
తెలవారుసమయాన మెలమెల్లగా జారి
    పోయె దుప్పటి ఉత్తరీయములును
అంత దిగంబరులైన అల్పులజూచి
    రవిరాజు కిరణవస్త్రమ్ము లొసగె
అవి దిక్కులనుకప్పి అంబర మూస్యత
    కాపాడజాలె లోకమ్మునందు

అట్టి సూర్యదేవుని కిరణాంచలములు
జనుల చిర మానమర్యాద ధనములెల్ల
ప్రీతి కాపాడినందుకు ప్రేమతోడ
అనుజ! పల్కుమా! వేగమ్ము స్వాగతమ్ము!

## వ్యాఖ్య

లోక బాంధవుని ఆగమనం తెలిపే తూర్పు రేకలు ఉదయిస్తున్నాయి. ద్విజ బృందాలు పలుకొన్నాయి. మంగళ వాద్యాలు ప్రభాత గీతాలు వినిపిస్తున్నాయి. తూర్పు తెల్లవారింది. ఆ దృశ్యం మనోజ్ఞంగా ఉంది. అది చూచి కవీంద్రుడు రమణీయ కల్పన చేశాడు.

ప్రజలంతా పగలంతా శ్రమించి రాత్రి తిమిరోత్తరీయాన్ని దట్టంగా కప్పుకొని గాఢంగా నిద్రపోయారు. ఆ దుప్పటి నల్లగా నులివెచ్చగా ఉంది. అందువల్ల వారికి ఆ రాత్రి బాగా నిద్ర పట్టింది. ఆ నిద్రలో చీకటి దుప్పటి జారిపోయింది. ఛళ్ళున తెల్లవారింది. గుడ్డలు తొలగిపోవటంతో వారు బట్టబయలయ్యారు.

అప్పుడే వచ్చిన అంశుమాలి ఇది గమనించాడు. సత్వరం సహాయం అందించి వారి మానం కాపాడాలని నిశ్చయించాడు. వెంటనే వేయి చేతులతో వేలకొలది వెలుగు దారాలు వెలువరించి నూతన వస్త్రం అల్లాడు. ఆ నూతనాంబరాలకు దశదిశలు అనే రంగు రంగుల జరీ అంచులు అమర్చాడు. అవి ధగ ధగ మెరుస్తున్నాయి. ఆదిత్యుడు అనురాగంతో వాటిని ప్రాణికోటిపై కప్పి వాటిని ఆదుకొన్నాడు.

ఆ నూతనాంబరాలు సకల ప్రాణికోటికి శుభదాయకాలు. వాటిని తయారుచేసిన ఆ కిరణాలు మంగళము నొసగుగాక.

★ ★

"శుభం భూయాత్"

6. శ్లోకం

న్యక్కుర్వన్నోషధీశే ముషితరుచి శుచేవౌషధీః ప్రోషితాభా
భాస్వద్గ్రావోద్గతేన ప్రథమమివ కృతాభ్యుద్గతిః పావకేన
పక్షచ్ఛేదవ్రణాసృక్స్రుత ఇవ దృషదో దర్శయన్ ప్రాతరద్రే
రాతామ్రస్తీవ్రభానోరనభిమతనుదే స్తాద్గభస్త్యుద్గమో వః

పద్యం

ఉదయకాలంబున ఓషధీనాథుండు
ఏలనో! కాంతిని కోలుపోయె
ఉడురాజు పేడి మహౌషధులేలనో!
కించిత్కళా తిరస్కృతములయ్యె
సూర్యకాంతసుమాలు శోభిల్లి కాబోలు!
తరణికి సుస్వాగతమ్ము పలికె
పక్షముల్ ఖండింపబడుటచే కాబోలు!
అరుణమయ్యెను ఉదయాద్రి శిలలు

రాము కాదిందులకు మహాకారణమ్ము-
దివము వెలిగించు భాస్కర దేవదేవు
ఉజ్జ్వలంబగు శుభ కిరణోదయమ్ము-
అనుజ! పల్కుమా! వేగమ్ము స్వాగతమ్ము!

వ్యాఖ్య

శుభంకరమైన ప్రాతఃకాలంలో ఉషోరేఖలు ఉదయిస్తు న్నాయి. పసుపు కుంకుమ వర్ణితాలైన ఆ రేఖలు బాలభాస్కరస్వామి ఆగమన సూచకాలు.

ఆ రేఖలు చూచి ఓషధీశుడైన చంద్రుని ముఖం వెలవెలా పోయింది. ఓషధీశుని విరహంచేత కాబోలు ఓషధులు కాంతులు కోలుపోయాయి. భాస్కరదేవుని ప్రతాపంవలె అరుణకాంతి దిశల వ్యాప్తిచెందింది. సూర్యకాంతమణులనుంచి అగ్నిజ్యోతులు ఉబికివచ్చి సూర్యభగవానునికి కర్పూర నీరాజనాలు సమర్పిస్తున్నాయి.

ప్రాక్ పర్వతరాజ శిఖరాలు ఇంద్రుని వజ్రాయుధ ప్రహా రాల చేత రాగరంజితాలైనాయి. పర్వత పక్షాలు ఛేదించబడటంచేత అంతా రక్తసిక్తారుణ ప్రభలు దిశల వ్యాపించాయి.

ఆ అరుణకాంతులు శత్రుభంజనం సూచిస్తూ ఆనంద మందారాలై ప్రజకు ఆశీస్సులు అనుగ్రహిస్తున్నాయి. అనిష్టాలు తొలగిస్తున్నాయి.

★ ★

"త్వం వరుణ పశ్యసి"

—సౌర పాఠం

6. శ్లోకం

శీర్ణఘ్రాణాంఘ్రిపాణీన్ వ్రణిభి రపఘనైర్ఘర్ఘరావ్యక్తఘోషాన్
దీర్ఘాఘ్రాతానఘౌఘైః పునరపి ఘటయత్యేక ఉల్లాఘయన్యః
ఘర్మాంశో స్తస్యవోఽంతర్ద్విగుణఘనఘృణానిఘ్ననిర్విఘ్నవృత్తేః
దత్తార్ఘాస్సిద్ధసంఘైర్విదధతు ఘృణయశ్శీఘ్రమంహోవిఘాతమ్

పద్యం

వికలాంగములు కల్గి వికృతధ్వనియొనర్చు
వ్యాధి పీడితులైన వారిపైన
శుష్కగాత్రము కల్గి శోణితమ్ములు నొల్కు
బహురోగముల క్రుంగు ప్రజలపైన
దీనాతిదీనులై దినవెచ్చమును లేని
గర్భదరిద్రవర్గమ్ముపైన
జ్ఞానమ్ము కొరమాలి మానమ్ము తెగనమ్మి
బ్రతుకుబండలు లాగు బడుగుపైన

అమిత కారుణ్యము వహించు అంశుమాలి
రోగహరణ ధన్వంతరీ యోగమూని
హర్షవర్షన కిరణాలు అంపినాడు
అనుజ! పల్కుమా! వేగమ్ము స్వాగతమ్ము!

## వాకిళ్ళ

అవిగో! బాలభాస్కర కిరణాలు వస్తున్నాయి. అవి ఆరోగ్య భాస్కర కిరణాలు. అవి భక్తులకు యశస్కరాలు. అవి ప్రకృతి వైద్య పరికరాలు. రోగహరణాలు. ఆయుఃకారణాలు. అవి తేజస్సుకు దోహదాలు.

ప్రజలు పూర్వజన్మ సంచితాలుగా, ప్రారబ్ధకర్మ ఫలితాలుగా కష్టాలను అనుభవిస్తుంటారు. క్లేశాలు మానసిక రోగాలు అనారోగ్యాలు పొందుతుంటారు. ఆర్తితో అల్లాడి వికలమైన అవయవాలతో బాధలుపడుతూ దుర్భర దుఃఖాలు పొందుతుంటారు. నీరస వ్యాధులతో నీరుకారిపోతుంటారు.

ఇది పరికించిన పద్మబాంధవుడు పరుగు పరుగున వస్తున్నాడు. ప్రజల వ్యాధుల్ని పారకొట్టాలని అందరినీ ఆనందపరచాలని అనేక ఔషధ కిరణాలు తెస్తున్నాడు. లోకబాంధవుడు పైకి తీక్షణ కిరణుడుగా ఉన్నా మనస్సులో ప్రజలపై ఎంత దయో చెప్పనలవి కాదు కదా!

ఆ జగద్బాంధవుణ్ణి కారుణ్య ప్రసార ప్రభువుని అమరులు సిద్ధులు అర్చిస్తున్నారు. ఆయనకు ప్రణమిల్లుతున్నారు. అడుగడుగునా ఆదిమ ఋషులు అనురాగహస్తాలు జోడించి "వైద్యో నారాయణో హరిః" అని స్తుతిస్తున్నారు.

★ ★

"భాస్కరం భువనేశ్వరమ్"



## 7. శ్లోకం

బిభ్రాణా వామనత్వం ప్రథమమథ తథైవాంశవః ప్రాంశవో వః
క్రాంతాకాశాంతరాళా స్తదను దశదిశః పూరయంత స్తతోఽపి
ధ్వాంతాదాచ్ఛిద్య దేవద్విష ఇవ బలినో విశ్వమాశ్వశ్నువానాః
కృచ్ఛ్రాణ్యుచ్ఛ్రాయ హేలోపహసిత హరయో హారిదశ్వా హరంతు

### పద్యం

శుభమంచు కన్పించె సూర్యమయూఖాలు
తపనీయ వామనత్వము వహించి
అపైన కన్పించె ఆదిత్య కిరణాలు
అత్యున్నతాభ్ర మధ్యమున నిలిచి
ఇంతట దశదిశల్ వ్యాపించె దీప్తులు
అసమానసరణి బ్రహ్మాండమెల్ల
అటుపై మరీచిక లద్భుతావహముగా
మహితమైన త్రివిక్రమమ్ములయ్యె

తిమిర బలిదైత్య దీర్ఘ హ స్తములనుండి
విశ్వలక్ష్మిని కాపాడు విష్ణుమూర్తి
సూర్యతేజస్సు తోనిండె చూచినావ!
అనుజ! పల్కుమా! వేగమ్ము స్వాగతమ్ము!

## వ్యాఖ్య

అదుగో! సూర్యభగవానుడు తూర్పుకొండపై ఉదయిస్తున్నాడు. ఎంత అందంగా ఉన్నాడు. చిన్నబింబం. అరుణమూర్తి చూడటానికి వామనమూర్తివలె ఉన్నాడు.

సూర్యప్రభలు అంతలోనే ఉన్నతములై క్రమంగా త్రివిక్రమాలౌతున్నాయి. త్రిలోకాల్ని ఆక్రమించేటట్లున్నాయి. సూర్యనారాయణుడు ఆదినారాయణుడే. ఆయన విశ్వమంతా నిండి విష్ణువయ్యాడు.

సూర్యుని కిరణాలు మొదట్లో తూర్పుకొండపై పొట్టివై చిట్టివై ఎర్రఎర్రగా బంగారుజ్యోతులై మెరిసిపోతూ ఆకాశానికే అందాల ఆభరణాలై ప్రకాశించాయి.

ఆ తరువాత అవి బంగారు శలాకలై తదుపరి వజ్రశూలాలై ఉష్ణకిరణాలై ధగధగలాడుతూ ఉన్నత మయూఖాలై మధ్యాహ్న సమయంలో మంటలు మండించాయి. సూర్యుడు తన ప్రతాపరోచిస్సు విరజిమ్మసాగాడు.

ఆ విష్ణుప్రభలు త్రివిక్రమస్ఫూర్తితో గాఢాంధకారంనుంచి బలిదైత్యునినుండి వలె విశ్వాన్ని విడిపించి వెలుగులు నింపాయి. ఆ హరిదశ్వకిరణాలు ప్రజలకు ఆయురారోగ్యాలు కలిగించుగాక!

★ ★

దిగ్విజయోస్తు!

## 8. శ్లోకం

ఉద్గాఢే నారుణిమ్నా విదధతి బహుళం యేఽరుణస్యారుణత్వం
మూర్ధోద్ధూతా ఖలీనక్షతరుధిరరుచో యే రథాశ్వాననేషు
శైలానాం శేఖరత్వం శ్రితశిఖరి శిఖా స్తన్వతే యే దిశంతు
ప్రేంఖంతః ఖే ఖరాంశోః ఖచితదినముఖాస్తే మయూఖాస్సుఖం వః

### పద్యం

అరుణుని ఆరుణిమ నధికంబు గావించు
సొగసైన సిందూర సోయగంబో
సప్తాశ్వముఖముల సంధించు కళ్ళాల
గాయాల జారు రక్తద్రవంబో
పర్వతరాజన్య భద్ర కిరీటాగ్ర
రమణీయ పద్మరాగప్రజంబో
ఉదయకాలమ్ములో ఉవ్వెత్తుగా లేచు
రజతాశ్వ పాదపరాగతతులో

నా కిశోర భాస్కర కిరణాలబాల
అంపచందాల మృదు రక్తచందనమ్ము
దేహ మలదుకవచ్చె ఆ దివ్యకాంతి
అనుజ! పల్కుమా! వేగమ్ము స్వాగతమ్ము!

## వ్యాఖ్య

అవిగో! అరుణకిరణాలు మహోదయంలో మంగళకరరంగా ప్రకాశిస్తున్నాయి. ఆ కిరణారుణ కాంతులు అనూరుని అరుణత్వాన్ని మరింత అధికం చేస్తున్నాయి.

అవిగో! అశ్వాలు! అందాలు చిందుతున్నాయి. అవిగో! అశ్వాల నోళ్ళల్లో కళ్ళాలు! ఆ కళ్ళాల ప్రక్క గాయాలు! గాయాల నుండి రక్తధారలు! నొప్పిపుడుతున్నాయి కాబోలు! పాపం! లోక సేవకై ఎన్ని కష్టాలు భరిస్తున్నాయి!

ఆ అరుణకాంతులు పర్వత శిఖరాలపైన ఎర్ర ఎర్రగా మెరిసిపోతున్నాయి. అవి పర్వత సార్వభౌముల శిరోభాగంపై ప్రకాశిస్తున్న రత్నకిరీటకాంతులు కాబోలు!

ఉదయపర్వతం పైనుంచి వేగంగా ప్రయాణించటంవల్ల సూర్యుని తెల్లని అశ్వాల పాదాల నుంచి రేగిన పరాగ సమూహాలా అన్నట్లు ప్రకాశిస్తున్నాయి అరుణమయూఖాలు.

ఆ కిరణాలు ప్రకృతికి అలంకరణాలు. ప్రజలకు సుఖోపకరణాలు.

★ ★

"సూర్యో మరీచి మాధత్తే"

—తైత్తిరీయం

### 9. శ్లోకం

దత్తానందాః ప్రజానాం సముచితసమయాకృష్ట సృష్టైః పయోభిః
పూర్వాహ్ణే విప్రకీర్ణా దిశిదిశి విరమత్యహ్ని సంహారభాజః
దీప్తాంశోర్దీర్ఘదుఃఖప్రభవభవభయోదన్వదుత్తారనావో
గావో వః పావనానాం పరమపరిమితాం ప్రీతిముత్పాదయంతు

పద్యం

క్షీరముల్ స్తనముల చేపుకుపచ్చి జ
    నులకు తృప్తినిడు ధేనువులవోలె
తూర్పుమొదలు అన్ని ఓర్పుగాతిరిగి స్వ
    స్థానముల్ జేరు రక్షకులరీతి
అధిర భయంకరమైన సంసార సా
    గరము దాటించు నౌకలవిధాన
సద్భావజాలమై సాహిత్య శిఖరాల
    వెలుగుచున్న కవిత్వవిద్యలటుల

సౌరకిరణాలు బహురూపధారణాలు-
సప్తప్రకృతి కలంకరణాలు- సర్వ
మంగళాభీష్టములుదీర్చు మమతమీర-
అనుజ! పల్కుమా! వేగమ్ము స్వాగతమ్ము!

### వ్యాఖ్య

అదిగో! అరుణకిరణాలు అందంగా ఆలమందలవలె ఉన్నాయి. ఆనందంగా అలరారుతున్నాయి.

ఆ గోవుల వంటి కిరణాలు సెలయేళ్ళలో నీళ్ళు కనిపించ గానే త్రాగుతున్నాయి. అవి నీళ్ళు త్రాగి పాలు ఇస్తాయి. పాలు పోసి పరమాన్నం పెడతాయి. పరమానందం కలిగిస్తాయి.

అవి అచ్చంగా ఆలమందలే సుమా! అవి ఆదిత్య సత్య దేవుని అరుణకిరణాలు. అవి ఆలమందలవలెనే ఉదయం లేవగానే నానా దిక్కులకు పోతాయి. అన్ని దిక్కుల్లో సంచారంచేసి చివరకు సాయంకాలానికి స్వగృహాలు చేరుకొంటాయి.

ఆ గోమాతలు అధిక దుఃఖాలను హరమారుస్తాయి. తమ తోక లందించి నరకలోకాలు దాటిస్తాయి. పుణ్యబలం చేకూరుస్తాయి. సంసార సముద్రాలు తరింపచేస్తాయి. నావలై భవసాగరాలు దాటించి పుణ్యలోకాలకు తీసుకుపోతాయి.

అవి పావనాలలో అతి పావనాలు. అవి మంగళాలలో అతి మంగళాలు. పరమ శ్రేష్ఠాలు. కామధేనువులెంతటి మహిమా న్వితాలో ఈ గో సమూహాలూ అంతటివి. గోవులంటే ఆవులనీ, కిరణా లనీ కూడా అర్థాలు. ఈ కిరణాలు గోవులవలె అందరికీ ఆనందం అందించుగాక!

★ ★

"పూర్వా సంధ్యా ప్రవర్తతే"

10. శ్లోకం

బంధధ్వంసైకహేతుం శిరసి నతిరసాబద్ధసంధ్యాంజలీనాం
లోకానాం యే ప్రబోధం విదధతి విపులాంభోజషండాశయేవ
యుష్మాకం తే స్వచిత్త ప్రథితపృథుతరప్రార్థనాకల్పవృక్షాః
కల్పాంతాం నిర్వికల్పం దినకరకిరణాః కేతనం కల్మషస్య

పద్యం

సంధ్యా నమస్కార శమిత శీర్షములకు
వరదాన కల్ప మీ కిరణసమితి
ప్రాకృతబంధ విధ్వంసమ్మునకు తద్వి
రాజ విజ్ఞాన మీ రశ్మిచయము
ముకుళిత పద్మసమూహమ్మునకు బంధ
విచ్ఛేదయోగ్య మీ వెలుగుగుంపు
ఆర్తితో ప్రార్థించు అర్థిసంఘమునకు
కల్పవృక్షమ్ము ఈ కరదళమ్ము

లోకబాంధవ దేవ విలోకనములు
విశ్వలక్ష్మికి మాంగళ్య ప్రేరణములు
బాలభానుని బంగారుప్రభలు అవిగో!
అనుజ! పల్కుమా! వేగమ్ము స్వాగతమ్ము!

వ్యాఖ్య

అదిగో! అరుణకిరణాలు ఆవిర్భవించాయి. ఆ దివ్య కాంతులు గమనించి ద్విజవరేణ్యులు సంధ్యావందనాదులకు ఉపక్రమించారు. వారు సూర్యునికి అర్ఘ్యాలనిచ్చి ప్రణవాంజలులు ఘటిస్తున్నారు.

పద్మపుష్ప సమూహాలు సహృదయ హృదయాలవలె విరసిస్తున్నాయి. అవి ప్రాక్కృతాదిబంధ విచ్ఛేదకాలు. అవి తత్త్వజ్ఞానానికి కారణాలు. అవి మంగళ సూచకాలు. అవి మృదుళ బంధాలు త్రెంచి వికాసాన్ని ప్రకాశాన్ని నాల్గు దిక్కులకు వ్యాపింపజేస్తాయి.

ఆ సూర్యభగవానుని కరుణకిరణాలు భక్తుల ప్రార్థనలు ఆలకించి సఫలంచేసే చింతామణులు. అవి కామితాలు నెరవేర్చే కమనీయ కల్పవృక్షాలు. అవి నిస్సంశయంగా పాప విధ్వంసకాలు. అజ్ఞాన తిమిరానికి నాశకాలు.

అవి లోకబంధు విలక్షణ విలోకనాలు. విశ్వ విజయలక్ష్మికి బంగారు పతాకాలు.

★ ★

"గో బ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం"

## 11. శ్లోకం

ఘోరా రాయో ధనాయాపది నపది కరాలంబభూతాః ప్రపాతే
తత్త్వాలోకైకదీపాస్త్రిదశపతిపురప్రస్థితౌ వీథ్య ఏవ
నిర్వాణోద్యోగి యోగిప్రగమనిజతనుద్వారి వేత్రాయమాణాః
త్రాయంతాం తీవ్రభానోర్దివసముఖసుఖా రశ్మయః కల్మషాద్వః

### పద్యం

ఉదయకాలము మహోదమును కలిగించి
జగతికి స్ఫూర్తి నొసంగునేవి?
అర్థించువారికి ఆనంద మొనగూర్చి
సిరుల వానలు పెల్లు కురియునేవి?
నరకాన బడకుండ నరసమూహమునెల్ల
ఒగి ఉద్ధరించు చేయూతలేవి?
తత్త్వశోధకములై ధన్యుల గావించు
శ్రద్ధ విజ్ఞాన దీపమ్ములేవి?

యోగులకు ముముక్షువులకు యోగ్యమైన
ద్వారరక్షకహస్త వేత్రమ్ములేవి?
అట్టి ఆదిత్యకిరణాలు అవిగొ వచ్చె
అనుజ! పల్కుమా! వేగమ్ము స్వాగతమ్ము!

స్వేచ్ఛ

అవిగో! అవి బాలభానుని బంగారు కిరణాలు. మంగళ తోరణాలు. ప్రకృతికి అలంకరణాలు. విశ్వసుందరికి ఆభరణాలు.

అవి ఉదయవేళల జనాభ్యుదయకరాలు. ప్రజలకు సుఖకరాలు. మంచి మనస్సులకు ఆకరాలు. అవి అర్థం కోరి ప్రార్థించే అభ్యర్థులకు ధనరాసులు కురిపించే వర్షధారలు. అవి నరులు నరక కూపాల్లో పడకుండా కాపాడే ఆధారాలు.

అవి తత్త్వజ్ఞాన కాంతులు నాల్గుప్రక్కలకు ప్రసారంచేసే ఏకైక ప్రదీపాలు. అవి వీరస్వర్గం అధిరోహించే మహాశూరులకు ఘంటాపథాలు. అవి ముముక్షువులకు మోక్షగవాక్షాలు. శరీరంతో మోక్షం పొందే పరివ్రాజకులను తన శరీర ద్వారమున నిరాటంకంగా ప్రవేశింపచేసే క్షేత్రాలు ఆ సూర్యకిరణాలు. అవి ముక్తిపురం నిరాటంకంగా ప్రవేశింపచేసే మార్గాలు. ఆ సూర్యకిరణాలు కల్మష హరణాలు.

★ ★

"ఇంద్రియాసత్పుష్కలం చిత్రభానుః"

—తైత్తరీయం

## 12. శ్లోకం

ప్రాచి ప్రాగాచరంత్యోఽనతిచిరమచలే చారుచూడామణిత్వం
ముంచంత్యో రోచనాంబు ప్రచురమివ దిశాముచ్చకైశ్చర్చనాయ
చాటూత్కైశ్చక్రనామ్నాం చతురముపచితైర్లోచనైరర్చ్యమానాః
చేష్టాంరాం చింతితానాముచితమచరమాశ్చండరోచీ రుచో వః

పద్యం

ఉదయపర్వతభాక్షి ఉత్తమాంగమ్ముపై
మహిత రంజిత మహోమణులు పేర్చి
లావణ్యయుత దిశాలంకారశోభకై
లలిత గోరోచనాజలము జల్లి
ప్రియప్రాణవల్లభ ప్రేమోక్తికై చూచు
చక్రవాకజనమ్ము సొగజేసి
బ్రహ్మాండభవనాన పసుపుకుంకుమ నవ్య
మంగళకాంతులు రంగరించి

వర్ణనీయమౌ పుణ్యాహవాచనమ్ము
దర్శనీయమౌ శుభసూత్రధారణమ్ము
సలుపవచ్చెడి సూర్య తేజస్సు లవిగో
అనుజ! పల్కుమా! వేగమ్ము స్వాగతమ్ము!

### వ్యాఖ్య

అవిగో! అరుణకిరణాలు ప్రకృతిమాతకు మంగళాభరణాలు. అవి జగత్ కావ్యానికి మంగళాచరణాలు.

సూర్యభగవానుని తొలి వెలుగులు ఉదయపర్వతరాజ్ఞి శిరోభూషణాలు. అందులోని కెంపుల సొంపులు మనోహర కాంతులీనుతున్నాయి. ఆ దృశ్యం మనోజ్ఞంగా ఉన్నది.

మరికొంతసేపటికి మరోరకమైన దృశ్యం కనిపిస్తున్నది. దిశాంగణాలు అలంకరించటం కోసం గోరోచనాజలం చుట్టూ చిలకరించినట్లుగా ఆ దృశ్యం అత్యంత ఆనందకరంగా ఉన్నది.

ఆ సుందర సుకుమార సుపర్ణ కిరణాభరణాలు అటుపై మరోభావం స్ఫురింపజేస్తున్నాయి. చక్రవాకాలు ప్రాణప్రియులను చూచుకొనడానికి తహతహపడుతున్నాయి. తమ మనోహరుల మధురోక్తులు వినడానికి నిశ్చలప్రతిమలై ప్రతీక్షిస్తున్నాయి. అందువల్ల వాటి నేత్రాంచలాలు సూర్యుని తొలి వెలుగు కిరణాలను చాతుర్యంగా ఆరాధిస్తున్నాయి. ఆ కిరణాలు చక్రవాకాలకు మనోరథ ప్రేరకాలు.

అవి తొలి వెలుగులు. అవి ఆకాంక్షలు పండిస్తాయి. అవి జీవులకు ఆహ్లాదకారకాలవుతున్నాయి.

★ ★

''సత్వాపత్రిన్ సహస్రగ్ం సూర్యాః''

—తైత్తరీయం

### 13. శ్లోకం

ఏకం జ్యోతిర్దృశౌ ద్వే త్రిజగతి గదితాన్యబ్జజాస్యైశ్చతుర్భిః
భూతానాం పంచమం యాన్యలమృతుషు తథా షట్సు నానావిధాని
యుష్మాకం తాని సప్తత్రిదశమునినుతాన్యష్టదిగ్భాంజి భానోః
యాంతి ప్రాహ్ణే నవత్వం దశ దధతు శివం దీధితీనాం శతాని

### పద్యం

లోకమంతటికి ఏకైక దివ్యజ్యోతి
నిండువెలుగునకు రెండుకనులు
మోహన సృష్టిలో మూడులోకమ్ములు
లోకేశ్వరునకు నాలుగుముఖాలు
బ్రహ్మాండమునకు స్వభావభూతము లైదు
గతిచక్రనేమికి ఋతువులారు
ముఖ్యులై భాసిల్లు మునివర్యు లేడ్గురు
అంచాల దిక్కులు అష్టకమ్ము

అద్భుతావహ పూర్వాహ్ణమందు చూడ
నవ మహత్వమ్ముపొందె ఆనందసీమ
దశశతములయ్యె రవితేజతతులు అవిగో
అనుజ! పలుకుమా! వేగమ్ము స్వాగతమ్ము!

వాక్కు

ఈ అఖిలాండకోటి బ్రహ్మాండానికి ఏకైక వెలుగు జ్యోతి ర్మయ దేవుడు. అతడు ఏకైక వెలుగు వేలుపు.

పరాత్పరుడికి జ్యోతిర్మయగోళాలైన సూర్యచంద్రులు రెండూ రెండు నేత్రాలు. ఈ విశాల విశ్వంలో స్వర్గమర్త్యపాతాళాలు మూడూ మూడు మూర్తులకు ప్రతీకలు.

స్రష్టయైన విధాతకు నాలుగు ముఖాలు. అవి ఋక్ యజు స్సామ అథర్వణ వేదాలకు నిలయాలు. తరువాత విస్తృతరూపం భూత పంచకం. అవి పృథ్వీజలం తేజస్సువాయువు ఆకాశం అనేవి. కాలచక్రంలో ఆకులు ఆరు. అవి ఋతువులు. వసంతం గ్రీష్మం శరత్తు హేమంతం శిశిరంవాటిపేర్లు.

మూలపురుషులు, మహనీయులైన మహర్షులు ఏడుగురు. వసిష్ఠ అత్రి గౌతమ కశ్యప భరద్వాజ జమదగ్ని విశ్వామిత్ర వీరు వైవస్వత మన్వంతరంలోని వారు. దిక్కులు ఎనిమిది. అవి తూర్పు ఆగ్నేయ దక్షిణం నైఋతి పశ్చిమం వాయవ్యం ఉత్తరం ఈశాన్యం. ఇది రవికి పరిధులుగిస్తాయి. సూర్యకిరణాలు నవం. ఇవి నిత్యనవ త్వంతో ప్రకాశిస్తుంటాయి.

ఇలా అరుణకిరణాలు ఏకసంఖ్యతో ప్రారంభమై సహస్రాధికమైనాయి. అందువల్లనే సహస్రశీర్ష పురుషుడు అతడు. విశ్వం వివస్వతుడిరూపం.

★ ★

"ఓం సహస్ర శీర్షా పురుషః"

## 14. శ్లోకం

ఆవృత్తి భ్రాంతవిశ్వాశ్శ్రమమివ దధతః శోషిణః స్వోష్మణేవ
గ్రీష్మే దావాగ్నితప్తా ఇవ రసమసకృద్యే ధరిత్ర్యా ధయంతి
తే ప్రావృష్యాత్తపానాతిశయరుజ ఇవోద్వాంతతోయా హిమర్తౌ
మార్తాండస్యా ప్రచండాశ్చిరమశుభభిదేఽభీశవో వో భవంతు

### పద్యం

మండువేసవి మాటిమాటికి భువి చుట్టి
వచ్చుటచే కడు వడలి వడలి
గ్రీష్మాన వడగాడ్పు రేగి తాను తపించి
కఠిన నిదాఘాన క్రాగి క్రాగి
దావాగ్ని తపనతో తల్లడిల్లినయట్లు
గోతుల జలములు గ్రోలి గ్రోలి
అతిసార ఘోరరుగ్మతచేత వాంతి వి
రోచనమ్ములతోడ క్రుంగి క్రుంగి

శీతకాలమ్ములో అతిక్షీణుడగుచు
పాటవ రహితుడయ్యెను భానుమూర్తి
అరుణకిరణాలు మనపైన బరపినాడు
అనుజ ! పల్కుమా ! వేగమ్ము స్వాగతమ్ము

వ్యాఖ్య

అవిగో ! సూర్యాంశువులు వెచ్చ వెచ్చగా ఉన్నాయి. అవి మండువేసవిలో విశ్వమంతా వీర విహారం చేయటంచేత కాబోలు డస్సి (శమ చెందినట్లున్నాయి.

సూర్యకిరణాలు తమ తాపంచేత తామే తపించి కృశించి క్రుంగి క్రాగి పోతున్నాయి పాపం. అవి దావాగ్నిలో వేగివేగి కను షించిన చోట్లల్లా ఎక్కడపడితే అక్కడ నానారకాల గుంటల్లో నీళ్ళు త్రాగి దప్పిక బాధ తీర్చుకొన్నాయి.

రవి కుమారుడు గ్రీష్మంలో అధిక జలపానం చేయటం వల్ల కాబోలు వానికి వర్షాకాలంలో అతిసారం వాంతులు ప్రారంభమైనాయి. నీళ్ళు అధికంగా కక్కుకోవడం మొదలు పెట్టాడు.

అంతటి ఉష్ణరశ్మి చలికాలంలో పాటవం తగ్గి చల్లని కిర ణాలను ప్రసరింపచేస్తున్నాడు. మార్తాండుని కిరణాలు ఇలా రక రకాల దశలలో కనిపిస్తున్నాయి. ఆ సూర్యాంశువులు ప్రజలను చల్లగా కాపాడుగాక !

★ ★

"మార్తాండ అంశుమాన్"

—ఆదిత్యహృదయం

## 15. శ్లోకం

తన్వానా దిగ్వధూనాం సమధిక మధురాలోకరమ్యామవస్థాం
ఆరూఢప్రౌఢిలేశోత్కలితకపిలిమాలంకృతిః కేవలైవ
ఉజ్జృంభాంభోజనేత్రద్యుతిని దినముఖే కించిదుద్భిద్యమానా
శ్మశ్రుశ్రేణీవ భాసాం దిశతు దశశతీ శర్మ ఘర్మత్విషో వః

## పద్యం

ప్రాగ్దిశాప్రాంతమ్ము పసుపుకుంకుమలతో
వలరాజు సందాల భవనమయ్యె
దినరాజు యువకుడై తేజరిల్లుచునుండ
రమనీయ కమలాలు కన్నులయ్యె
హరినీలమణులుగా మెరయు నవ్య మయూఖ
సాహస్రి మొలక మీసమ్ములయ్యె
హేమాంగ దశదిశా భామినీమణులకు
దర్శనంబన విల్తుతాపమయ్యె

వాలుగంటుల చూపులు పైనసోకి
రవికుమారుని పెదదయురమ్ము నుబికె
సహజ సుందర భాను మీసమ్ము లవిగో
అనుజ! వల్కుమా! వేగమ్ము స్వాగతమ్ము

వ్యాఖ్య

ఆ ఉదయం భువనం సువర్ణకాంతులు వెదజల్లుతున్నది. రవికుమారుడు మన్మథునివలె మెరిసిపోతున్నాడు. చూడ ముచ్చటగా ఉన్నాడు.

ఆ స్వామికి అన్నీ సహజాలంకారాలే. విశాలమైన నేత్రాలు పద్మపత్రాలవలె చక్కదనము చిందిస్తున్నాయి. ముఖం మంచి తేజస్సుతో కళకళలాడుతున్నది. పురుషత్వం పుంజీభవించింది. నల్లగా అప్పుడే వస్తున్న మీసాలు ముఖానికి క్రొత్త నగ పెట్టినట్లున్నది. ముఖంపై నీలిరంగు మొలచ మీసాలు పద్మంపై వ్రాలిన గండుతుమ్మెదల్లా ఉన్నాయి. మోము మునిముని నవ్వులు ఒలకబోస్తున్నది. అది మారుని తూపులు రువ్వుతున్నాయి.

దిగ్వధూటీమణులు రవి కుమారుణ్ణి చూశారు. కన్నులు విప్పార్చి చూశారు. చూచినకొలదీ ఇంకా ఇంకా చూడాలనిపించిందిట. మరిమరీ మార్చి మార్చి చూశారు. అతనిపై వాలుచూపుల తూపులు విసిరారు. అతని అందాన్ని తనివితీరా గ్రోలారు. ఆనందం చెందారు. మీసాలనుచూచి మోజుపడ్డారు. ఇరువురూ ముగ్ధమనోహరంగా చూసుకొన్నారు. కన్నులు కలిశాయి. కమలాక్షులు కల్యాణగీతాలుపాడారు.

సూర్యుణ్ణి యువకుడుగా, కిరణాలు ఆయనకు అందమైన మీసాలుగా, దిక్కులు ఆయనను వలచిన కాంతలుగా కవి ఊహించాడు.

★ ★

"కల్యాణమస్తు"

### 16. శ్లోకం

మౌళీందోర్మైష మోషీద్ద్యుతిమితి వృషభాంకేన యశ్శంకితేవ
ప్రత్యగ్రోద్ఘాటితాంభోరుహకుహరగుహాసుస్థితేనేవ ధాత్రా
కృష్ణేన ధ్వాంతకృష్ణస్వతనుపరిభవత్రస్నునేవస్తుతో ఒలం
త్రాణాయస్తాత్తనీయానపి తిమిరరిపోస్స త్విషాముద్గమో వః

### పద్యం

తన శీర్షమందలి ధవళాంశుకాంతిని
ఏప్రొద్దునైన హరించునేమొ !
తన జన్మభవనమ్ము తామరపువ్వునుండి
ఏప్రొద్దునైన పంపించునేమొ !
తన దేహమందలి ఘనవర్ణ రాజమ్ము
ఏ ప్రొద్దునైన మాయించునేమొ !
తన రెండుకన్నుల తత్త్వమ్ము పసికట్టి
ఏ ప్రొద్దునైన తగ్గించునేమొ !

అని శివుండు ధాత వనమాలి విష్ణువు
స్తుతులొనర్చిరంత శుభ మటంచు
అట్టి స్తుతి గ్రహించు ఆదిత్యరుచులపై
సాదరముగ వలుకు స్వాగతమ్ము

## వ్యాఖ్య

సాంబశివుడు చందమామను తలపూవుగా అలంకరించుకొన్నాడు. చంద్రుడు చల్లగా హాయిగా ఉన్నాడు. శివుడికీ సుఖంగా ఉంది.

ఉదయం కాగానే సూర్యుడు వచ్చాడు. సూర్యుడు మరీ మెరిసిపోతున్నాడు. సూర్యుడు చంద్రునికంటె తేజోవంతంగా ఉంటే తన తలలోని పూవును వాడేలాగ చేస్తాడేమోనని శంకతో శంకరుడు సూర్యస్తవం చేయసాగాడు.

ప్రభాకరుడు పద్మబాంధవుడు. సూర్యోదయంతో పద్మాలు వికసిస్తాయి. బ్రహ్మ పద్మోద్భవుడు. బ్రహ్మ అనుకొన్నాడు కదా- సూర్యుడు ముడుచుకుపోతున్న కమలాన్ని వికసింపజేశాడు. ఉపకారం చేస్తున్నాడు. మంచిదే కానీ ఇక నా నివాసం ఖాళీ చేయిస్తాడేమోనని, పద్మాన్ని వికసింపచేసిన కృతజ్ఞతతోనూ బ్రహ్మ సూర్యస్తవం చేయసాగా.

దివాకరుడు నల్లగా ఉండే చిమ్మచీకటిని దూరంగా పారద్రోలాడు. కృష్ణుడు నల్లటివాడు. కృష్ణుడనుకొన్నాడు కదా- చీకటి వంటి నల్లటివాటిని పారగొట్టటం ఇతడికి సహజం. నల్లగా ఉన్న తన తనువునుకూడా ఇతడు పరాభవిస్తాడేమోనని శ్రీకృష్ణుడు సూర్యస్తవం చేయటం మొదలుపెట్టాడు. ఆ పరమాత్మకు సూర్యచంద్రులు రెండు కళ్ళు. సూర్యుడుదయించి చంద్రుణ్ణి కాంతివిహీనుణ్ణి చేశాడు. రెండవ కన్నుగా ఉన్న సూర్యుడు తన కాంతినెక్కడ తగ్గించుకొంటాడోనని విష్ణువు సూర్యనారాయణ స్తోత్రం చేయసాగాడు.

కారణం ఏదైనా బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ఆదిత్య హృదయం స్తోత్రం చేస్తున్నారు. సకల దేవతాస్వరూపుడు ఆ సత్య ఆదిత్యమూర్తి.

★ ★

"తేజసామపి తేజస్వీ"

—ఆదిత్య హృదయం

## 17. శ్లోకం

విస్తీర్ణం వ్యోమదీర్ఘాస్సపది దశదిశో వ్యస్తవేలాంభసోఽబ్ధీ
న్కుర్వద్భిర్దృశ్యనానానగనగరనగాభోగపృథ్వీంచ పృథ్వీమ్
పద్మిన్యుచ్ఛ్వాస్యతే యైరుషసి జగదపి ధ్వంసయిత్వా తమిస్రా
ముస్రా విస్రాణయంతు ద్రుతమనభిమతం తే సహస్రత్విషో వః

### పద్యం

ప్రత్యూషమున లేచి బలమైన చేతుల
    చిమ్మచీకటిని నశింపజేసి
చదలుకొప్పున కొక్కసారిగా ఎగసి వే
    గాన దిశలను దీర్ఘములు సలిపి
సప్తర్షి సంస్తుత్య సప్తసముద్ర జ
    లాలు భూస్థలిని దశాపి చల్లి
పురపర్వతారణ్య భూరుహా సంకుల యో
    గ్రమిత ధారుణి విశాలతనునొసర్చి

పద్మలతలును సంతోషపడగ - సర్వ
జగతి కానందరుచులు ప్రసార పరచు
రవి సహస్రమయూఖాలు అవిగో వచ్చె
అనుజ! పల్కుమా! వేగమ్ము స్వాగతమ్ము

## వ్యాఖ్య

శ్రీ సూర్యనారాయణ భగవానుడు లోకబాంధవుడు. లోక సేవా కార్యక్రమాలు ఆయన నిత్యవ్రతాలు. పద్మబాంధవుడు పరమ లోకోపకారి.

సూర్యదేవుడు ఉషఃకాలంలోనే ఉల్కొంచి తన కరుణ కిరణాలతోనే బాణాలువేసి మునుముందు అంధకారాసురుల్ని హత మారుస్తాడు. అంతటా ప్రభాతకాంతులు ప్రసరింపచేస్తాడు. ఆ తరువాత ఆదిత్యుడు ఆకాశం ఎత్తు ఎగిరి దశదిశాంగణాలనూ సువిశాలం సుప్రకాశవంతం చేస్తాడు. ప్రకృతినంతా పరమ శోభాయమానంగా అలంకరిస్తాడు.

అరుణిమ్మకు సప్తాశ్వరథుడు వచ్చాడనీ సప్తసముద్రాలూ జలాలు తెచ్చి ధరిత్రీమతల్లిని పవిత్రీభూతం చేయటానికి సత్వర తరంగాలతో సంప్రోక్షణ చేస్తుంటాయి. అపుడు లోకబంధు కర్మసాక్షి వచ్చిచూచి భూప్రదేశంలోని అనేక నగరాలు పట్టణాలు గ్రామాలు కొండలు కోనలు గట్టులు మిట్టలు చెట్లు చేమలు అన్నీ బాగా కను పించేలాగా ప్రస్ఫుటంగా కాంతులు ప్రసాదించి వాటిని ప్రకాశవంతం చేసి వాటికి నూతన్న శక్తిని అందిస్తాడు.

దివాకరుడు సహస్రకిరణాలతో సహస్ర విధాల అల్ప జీవుల్ని ఆదుకొంటాడు. జగత్తుతోపాటు చిన్నచిన్న పద్మలతలను స్తైతం ఆనందపరుస్తాడు స్వామి. ఆ సత్యసంధుడు త్యాగమయ జీవనుడు. జగచ్చక్షువు అయిన ప్రభాకరస్వామి కరుణ వర్ణనాతీతం. ఆ రవికిరణాలు ప్రజలకు రక్షాభరణాలు దివ్యకవచాలు.

★ ★

"మహో తేజః"

—ఆదిత్య హృదయం

### 18. శ్లోకం

అస్తవ్యస్తత్వశూన్యో నిజరుచిరనిశానశ్వరః కర్తుమీశో
విశ్వం వేశ్మేవ దీపః ప్రతిహతతిమిరం యః ప్రదేశస్థితోఽపి
దిక్కాలాపేక్షయాసౌ త్రిభువనమటతస్తిగ్మభానోర్నవాఖ్యాం
యాతశ్శాతక్రతవ్యాం దిశిదిశతు శివం సోఽర్చిషాముద్గమో వః

### పద్యం

తత్త్వశూన్యమ్ము అస్తవ్యమ్ము దీపమ్ము
స్తవనీయతత్త్వమ్ము సవితృ కరము
నిజకాంతి బలములేనిది దివ్వె - అవిరళ
సహజభాసురము భాస్కర మరీచి
చావుపుట్టుకలతో సతమతమౌ జ్యోతి
శాశ్వతప్రభల నొసంగు రశ్మి
పగలు నశించు స్వభావమ్ముగలదిది
సతము స్వయంప్రకాశముగలదది

ఒక్క దిక్కాలవిభజన లెక్కలేర
ప్రాతక్రొత్తలు లేనిది భానుదీప్తి
తూర్పు నుదయించుచున్నట్లు తోచు నదిగో
అనుజ! పల్కుమా! వేగమ్ము స్వాగతమ్ము

## వ్యాఖ్య

దీపం దివాకరదీధితి ఒకటికాదు. దీపం రాత్రిపూట గృహం లోని చీకటిని తొలగిస్తుంది. దినమణిద్యుతి లోకంలోని అంధకారం అంతా మాయం చేస్తుంది.

దీపం అస్తవ్యం. సవితృకాంతి స్తవనీయం. దీపం తత్త్వ జ్ఞానశూన్యం. దివాకరదీధితి తత్త్వవిజ్ఞానదాయకం. దీపం వినాశ సంభవం. లోకబంధుప్రభ వినాశబాధారహితం. దీపం స్వయంప్రభా శక్తిహీనం. ద్యుమణిద్యుతి స్వయంప్రకాశవిలసితం. దీపం తైలాది పరాపేక్షితం. ఆదిత్యసత్యజ్యోతి పరాపేక్షరహితం. సహజప్రభా భాసితం.

మార్తాండ మరీచి అనిశం అనశ్వరం. అది మూడులోకాల్ని వెలిగిస్తుంది. అది సదా నిశ్చలం. దానికి ప్రాతక్రొత్తలు లేవు.

దివాకరుడు దిక్కాల విభాగంవల్లమాత్రం ప్రాచీనం ఉదయించి అర్వాచీనం అస్తమిస్తున్నట్లు కనిపిస్తాడు. అంతే. అసలు కర్మసాక్షికి ఉదయాస్తమయాలు లేనేలేవు. ఆయన త్రయీ తనూ రూపుడు. ఆయన నిత్యుడు సత్యుడు ఆదిత్యుడు. సవితృతేజం సర్వ లోకవ్యాప్తం.

 

"భాస్కరాయ విద్మహే మహద్ద్యుతికరాయ ధీమహి
తన్నో ఆదిత్య ప్రచోదయాత్"

## 19 శ్లోకం

మాగాన్మ్లానిం మృణాళీమృదురితి దయయేవాప్రవిష్టోఽహిలోకం
లోకాలోకస్య పార్శ్వం ప్రతపతి న పరం యస్తదాఖ్యార్థమేవ
ఊర్ధ్వం బ్రహ్మాండఖండస్ఫుటనభయపరిత్యక్తదైర్ఘ్యో ద్యుసీమ్ని
స్వేచ్ఛావశ్యావకాశావధిరవతు సవస్తాపనో రోచిరోఘః

### పద్యం

భర్గ! లోకాలోక పర్వతంబునకేవి
అవలి పక్కకు అరుగకుండె?
సుకుమార సర్పాలు స్రొక్కిపడుంతగనేవి
పాతాళభూముల ప్రాకకుండె?
బ్రహ్మాండభాండాలు పగలకుందగనేవి
ఎల్ల దిక్కుల ప్రసరింపకుండె?
అంచాలుచిందాడు ఆకాశమునకేవి
అక్షేమంబుగ నడపాడకుండె?

ఆ మయూఖాలు భాగ్యయోగ్యాలు సతము
లోకములకెల్ల క్షేమావలోకనములు
సంపదలొసంగు ఉదయభాస్కరకరాలు
అనుజ! వల్కుమా! వేగమ్ము స్వాగతమ్ము

## వ్యాఖ్య

ఆదిత్యదేవుడు అనురాగమూర్తి. ఆయన లోకబాంధవుడు. ఆ లోకబాంధవ సురుచిరకరాలు దయకు ఆకరాలు. ఆ కాంతి ప్రవాహం కారుణ్యరసప్రవాహం సుమా! అందుకు ఎన్నో ఉదాహరణలు.

మహోరగాలు పాతాళలోకంలో ఉంటాయి. అవి అతి కోమలాలు. అవి లేత తామరతూండ్లవలె పూలతీగెలవలె సుకుమారంగా అత్యంత మృదువుగా ఉంటాయి. వేడి ఆ సర్పాలకు సోకి వాటిని తపింపచేస్తాయి. అన్ని జీవులూ ఆ వేడి తట్టుకోలేవు. ఇది గమనించి సూర్యదేవుడు తన వాడికిరణాలను అటు పాతాళం పంపనే పంపడు. ఎంత దయామయుడు!

మేరుపర్వతరాజం పేరు లోకాలోకం. లోకంలో అది సార్థకమైన భూధరం. అందువల్ల ఆ పర్వతనామం పాడుచేయరాదని దాని ఈవలివైపే కాని ఆవలివైపుకు అంశుమాలి అరుగనే అరుగడు.

బ్రహ్మాండం ఒక భాండం. దాని పైభాగం సుతిమెత్తన. బ్రహ్మాండంపైన తన వేడి తీక్ష్ణంగా ప్రసరిస్తే ఎక్కడ పగిలిపోతుందో అని మధ్యాహ్నముహూర్తంలోకూడా తన ఉష్ణరాశిని అటువైపు దీర్ఘంగా ప్రసరింపనే ప్రసరింపనీయడు. సువిశాల ఆకాశం మొత్తం తిరుగుతున్నా మినుగురుల తేడుండా ఓర్పుగా నేర్పుగా సర్వశ్రేయస్కరంగా పర్యటన చేస్తుంటాడు మహానుభావుడు.

ఆ కర్మసాక్షి కాంతిప్రవాహం అందరినీ రక్షించుగాక!

 

"సూర్యశ్చ మామన్యుశ్చ మన్యుపతయశ్చ"

20 శ్లోకం

అశ్యామః కాల ఏకో న భవతి భువనాంతోఽపి పీతేఽంధకారే
సద్యః ప్రాలేయపాదో న విలయమచలశ్చంద్రమా అప్యుపైతి
బంధస్సిద్ధాంజలీనాం నహి కుముదవనస్యాపి యత్రోజ్జిహీతే
తత్త్రాప్తః ప్రేక్షణీయం దిశతు దినపతేర్ధామ కామాధికం వః

పద్యం

ఏ భాస్కరమరీచి ఇంచుక కనిపింప
అంధకారంబెల్ల అంతరించు
ఏ భానుకిరణమ్ము ఇంచుక కనిపింప
జగతి మధ్యమ్ము నశ్యామయగును
ఏ ప్రభాదీధితి ఇంచుక కనిపింప
నెరిముంచుకొంతలు సిరుగాటు
ఏ వెలుంగులగమి ఇంచుక కనిపింప
అమృతకరుడు విలయమ్ముకొందు

సిద్ధులైనవారి చేతులే కాటుంత
ముగుదరకలువపూలు ముడుచుకొనును
అట్టి సూర్యతేజ మారోగ్యభాగ్యమ్ము
సాదరమ్ము పలుకు! స్వాగతమ్ము!

## వ్యాఖ్య

సూర్యోదయం సర్వజనాభ్యుదయం. సూర్యస్మరణం చాలా శక్తివంతమైన మంత్రం, తంత్రం, యంత్రం.

సూర్యోదయం కాగానే అజ్ఞానానికి ప్రతీక అయిన అంధకారం అంతరించి పోతుంది. జ్ఞాన ప్రతీక అయిన ప్రకాశం ప్రసరిస్తుంది. అంతేకాదు కాలం అంతా ప్రకాశవంతమవుతుంది. లోకం ఆశ్చర్యమవుతుంది. లోకులు కన్నులు తెరుస్తారు.

సూర్యోదయం కాగానే నేలపై హిమపత్పర్వత పాద భూముల మంచు కరిగిపోతుంది. ఆకాశంపై విహారంచేసే హిమాంశువు కూడా కళవళపడి కాంతివిహీనత పొందుతాడు. హిమం అంతరించి పోతుంది.

సూర్యోదయం కాగానే పితృలు సాధ్యులు యక్షులు కింపురుషాదులు అందరూ అతి భక్తిశ్రద్ధలతో సూర్యనమస్కారాలు చేస్తారు. సూర్యునిముందు చేతులు జోడిస్తారు. ముకుళితహస్తులౌతారు. ఇంతేకాదు మానవులే కాదు పలువపూలు సైతం ముదంతో ముకుళితమౌతాయి. సూర్యుడంటే వాటికికూడా ఎంత భక్తి!! కమలాలు తన్మయత్వంతో తలెత్తుతాయి. ఇది సూర్యోదయ ప్రభల ప్రభావం.

★ ★

"ఏతమైవాప్యలా సహస్రసూర్యతాయా ఇతివైశంపాయనః"

—తైత్తరీయం

21. శ్లోకం

యత్కాంతిం పంకజానాం న హరతి కురుతే ప్రత్యుతాధిక్యరమ్యాం
నో ధత్తే తారకాభాం తిరయతి నితరామాశు యన్నిత్యమేవ
కర్తుం నాలం నిమేషం దివసమపి పరం యత్తదేకం త్రిలోక్యాః
చక్షుస్సామాన్యచక్షుర్విసదృశమఘభిద్భాస్వతస్తాన్మహో వః

పద్యం

సరళనేత్రయుగమ్ము సారసమ్ములలోని
అందాలనెల్లను డిందుసేయు
భాస్కరనేత్రమ్ము పద్మప్రభారాశి
ననురాగ మొప్పగా ఆదరించు
సరళనేత్రయుగమ్ము తారకావళిశోభ
ప్రియమైన రీత్యతిశయత మించు
అరుణుని నేత్రమ్ము తారకావళిదీప్తి
రాజసమ్మునను తిరస్కరించు

సహజమైన నేత్రము నిమేషమ్ము సేయు
దివ్య భాస్కరనేత్రమ్ము దినముకూర్చు
సూర్యనేత్రమ్ము దురితమున్ సొక్కసేయు
అనుజ! పల్కుమా! వేగమ్ము స్వాగతమ్ము

మయూర శ్రేంకృతి

## వ్యాఖ్య

సామాన్యంగా మానవుల కాంతిమంతములైన కన్నులు కమనీయమైన సౌందర్యం కలిగి కమలాల సౌందర్యాన్ని తక్కువ చేస్తాయి. అందంలో అతిశయిస్తాయి.

కానీ సూర్యతేజమనే నేత్రం విలక్షణంగా ప్రకాశిస్తుంది. అల్పములైన అంబుజాల సౌందర్యాన్ని అభివృద్ధిపరుస్తుంది. అది చిన్నదికదా అని చిన్నబుచ్చడు. తగినంత మేలే చేస్తుంది. రాజీవాల జీవనాన్ని రమ్యతమం చేస్తుంది. ప్రభాకరుని పరోపకార పరాయణత అట్టిది.

మానవనేత్రం తనలో నల్లని తారకలకాంతిని పొందుతుంది. తన సౌందర్యాన్ని ఇనుమడింపచేసుకొంటుంది. సూర్యనేత్రం తారల కాంతినిపొందక వాటిని తిరస్కరించిప్రకాశిస్తుంది. తన మహా తేజస్సు చేత సర్వాన్ని ప్రకాశవంతం చేస్తుంది.

మనుష్యుల నేత్రం నిమేషం అంటే రెప్పపాటు కలిగి ఉంటుంది. సూర్యనేత్రం ఇంతకంటె మించి నిమేషమును మాత్రమే కాక దినమునుకూడా కలిగిస్తుంది. రోజునంతా ప్రభాపూర్ణం చేస్తుంది.

ఇలా ముల్లోకాలన్నింటిలోకి సామాన్యనేత్రంకంటే సూర్య నేత్రం ఎన్నోవిధాల విలక్షణమైనది. అటువంటి సూర్యతేజం మీపాపాలను పటాపంచలు చేయుగాక.

★ ★

"స్వస్తినః పూషా విశ్వవేదాః"

—తైత్తరీయం

## 22. శ్లోకం

క్ష్మాం క్షేపీయఃక్షపాంభశ్శిశిరతరతల స్పర్శతర్షాదృతేవ
ద్రాగాశా నేతుమాశాద్విరదకరసరఃపుష్కరాణీవ బోధమ్
ప్రాతః ప్రోల్లంఘ్య విష్ణోః పదమపి కృపయేవాతివేగాద్దవీయ
స్యుద్దామంద్యోతమానా దహతు దినపతేర్దుర్నిమిత్తంద్యుతిర్వః

### పద్యం

హిమజలస్థానాలు స్పృశియించు కాంక్షతో
త్వరితగతిన్ భూమి తాకునవియు
దిగ్దంతికరసరోదీర్ఘికాబ్జము విక
సింపజేయ దిశల చేరునవియు
ప్రత్యూషమున విష్ణుపదము గమించి దూ
ర ప్రదేశాలకు ప్రాకునవియు
భూనభోదశదిశల్ పొంపిరివోవ వి
శేషద్యుతుల ప్రకాశించునవియు

అయిన ఆదిత్య సత్య విఖ్యాతమూర్తి
స్వర్ణకిరణాలు దిక్కులవ్యాప్తమై సు
మంగళజ్యోతులై ప్రభామయములయ్యె
అనుజ! పల్కుమా! వేగమ్ము స్వాగతమ్ము

## వ్యాఖ్య

అవిగో! అవి సూర్యనారాయణస్వామి తరుణకిరణాలు. అవి నేలతల్లికి ఆభరణాలు. అవి ఎల్లరకూ స్ఫూర్తినిస్తున్నాయి. అందరికీ ఆహ్లాదం అందిస్తున్నాయి.

మంచునీటిచేత మిక్కిలి శీతలంగా అలరారుతున్నది భూమి. అటువంటి చల్లని భూమిని స్పృశించాలనే ఉత్కంఠతో రవికుమారుడు తన బంగారు హస్తాలు భూమివైపు చాచుకొని పరుగుపరుగున వస్తున్నాడు.

అష్టదిక్కులు అష్టదిగ్గజాలవలె ఉన్నాయి. ఆ ఐరావతాలు సిందూరం అలంకారం చేసుకొని వస్తున్నాయి. నడకొండల్లాగా నడుస్తున్నట్లున్నాయి. వేదండతుండాలనే ఆ సరోవరాలలోని పద్మాలను వికసింపచేయటంకోసం కాబోలు కమలబాంధవుడు ఉత్సాహంతో తన వేయి చేతులు చాచి పరువెత్తుకు వస్తున్నాడు. ఎంత పరోపకార పరాయణత !

ప్రత్యూషకాలంలో విష్ణుపదమైన ఆకాశాన్ని దాటివెళ్ళి కూడా సిగ్గుపొంది మరింత వేగంతో దూరంగా వెళుతున్నాయా అన్నట్లున్నాయి సూర్యుని కిరణమాలికలు. మిక్కిలి ప్రకాశవంతమైన ఆ భాస్కరకిరణాలు మంగళజ్యోతులై దుఃఖాలను హరిస్తూ తేజరిల్లుతున్నాయి.

★ ★

"మూర్ధన్వాన్ సూర్యవర్చా"

—తైత్తరీయం

23. శ్లోకం

నో కల్పాపాయవాయోరదయరయదళత్క్ష్మాధరస్యాపి గమ్యా
గాఢోద్గీర్ణోజ్జ్వలశ్రీరహని న రహితా నో తమఃకజ్జలేన
ప్రాప్తోత్పత్తిః పతంగాన్న పునరుపగతా మోషముష్ణత్విషో వో
వర్తిస్సైవాన్యరూపా సుఖయతు నిఖిలద్వీప దీపస్య దీప్తిః

పద్యం

పర్వతమ్ములుకూల్చు ప్రళయప్రభంజన
మద్దాని నొక్కింతనార్పలేదు
వికటపతంగాలు విరివిగా వచ్చినన్
గాయమ్ము నొక్కింత సేయలేదు
దినభాగమెల్లను దేదీప్యకాంతితో
విశ్వరాజ్యంబెల్ల వెలుగజేయు
అజ్ఞానతిమిరమ్ము ఆవంతయును లేక
స్వచ్ఛమై సుప్రకాశమ్ము జిమ్ము

మరి పతంగోదయమ్మునే మహికిగూర్చు
ద్వీపలోకగ్రహాలకు దీపమైన
సూర్యదేవుని దీధితి శోభలవిగో
అనుజ! పల్కుమా! వేగమ్ము స్వాగతమ్ము

పీఠిక

ఆదిత్యుడు ఆకాశదీపం. ఆయన నిత్య సత్యజ్యోతి. ఆయన విఖ్యాతి త్రిలోకాతీతం. ఆ దినకరదీప్తి తేజోవిలసితం.

వాయువు దీపాలను ఆర్పివేస్తుంది. ప్రళయకాల ప్రభంజనం పర్వతాలను పగులకొడుతుంది. కులనగాలను కూల్చివేస్తుంది. సప్త సాగరాలను ఘోషిల్లజేస్తుంది. కానీ సూర్యకాంతిని ఏమీచేయలేదు. విభాకర దీధితి విశ్వవిజయజ్యోతి.

సాధారణమైన దీపాన్ని మిడుతలుకూడ ఆర్పివేస్తాయి. కాని అమృత కాంతుల్ని ప్రసరింపచేసే ఈ దీపం పతంగకృత వినాశం లేనిది. పైగా ఈ కాంతి సూర్యునినుండి ఆవిర్భవిస్తుంది కాబట్టి ఇది పతంగకృతోత్పత్తిగలది. పతంగ అనే శబ్దానికి మిడుత అని సూర్యుడని రెండర్థాలు.

సాధారణమైన దీపం పగలు ప్రకాశింపదు. కాని ఈ సూర్య దీపంకాంతి దినభాగంలో మిక్కిలి వెదజల్లబడుతుంది. ఈ కాంతి మహామహిమోపేతం. సాధారణమైన దీపానికి మసిపట్టటమనే కళంకం ఉంది. దీనికి చీకటి కాటుక అంటనే అంటదు.

మామూలుదీపం ఒక గృహానికే పూర్తిగా కాంతిని ఇవ్వ లేదు. కాని సూర్యజ్యోతి సమస్త జంబూప్లక్షాది ద్వీపాలనుకూడా తేజోవంతం చేస్తుంది. వృక్షాలను పెంచుతుంది. పూలు పూయిస్తుంది. ఫలాలు అందిస్తుంది. ఆదిత్యసంపద ఆరోగ్యం ఆనందం కలిగిస్తుంది.

దినకరదీపం అనంతప్రభావం గలది. దీనిముందు గృహ దీపం అత్యల్పంకదా!

 

"జ్యోతిషాం పతయే నమః"

—ఆదిత్య హృదయం

24. శ్లోకం

నిశ్శేషాశావపూర ప్రవరగురుగుణశ్లాఘనీయస్వరూపా
పర్యాప్తం నోదయాదౌ దినగమన మయోపప్లవేఽప్యున్నతైప
అత్యంతం యానభిజ్ఞా క్షణమపి తమసా సాకమేకత్ర వస్తుం
బ్రధ్నస్యేద్ధా రుచిర్వో రుచిరివ రుచిరస్యాప్తయే వస్తునోఽస్తు

పద్యం

సంతోషరుచితోడ సకలాశలనునింపు
గుణములో లోకభూషణమువాడు
ఉదయాస్తమయముల ఉన్నతస్థితినంది
ఉచిత స్థితప్రజ్ఞనుండువాడు
అజ్ఞానతిమిరమ్ము అంటి క్షణంబైన
నిలిచియుండని శ్రీమనీషివాడు
పదునాల్గులోకాలు పట్టని రుచులతో
నిత్యమహస్సులు నింపువాడు

ఉదయ మధ్యాహ్న సాయం మహోత్సవాల
విధి మహేశ్వర శ్రీ మహావిష్ణువైన
సూర్యదేవుని కిరణాలు చూడుమవిగో
అనుజ! పల్కుమా! వేగమ్ము స్వాగతమ్ము

## వ్యాఖ్య

అవిగో! అవి రవి రుచులు. అవి ఆదిత్యుని అభిరుచులు. ఆ తేజస్సు మహా మహస్సు. జీవకోటికది తీయని పయస్సు.

సూర్యప్రకాశం సమస్త ఆశలను నింపుతుంది. దశదిశలను అది తేజోమయం చేస్తుంది. ఆ ఆకాశజ్యోతి ఒక ఆశాజ్యోతి. అది అందరి ఆశయాలను అలరిస్తుంది.

అర్క తేజస్సు. అదే ఆర్షతేజస్సు. అది ఉదయాస్తమయాలలో ఒకే విధంగా అత్యంత ఆకర్షణీయంగా ఉంటుంది. అభ్యుదయ వినాశాలలోనూ అది ఉన్నతంగానే ఉంటుంది. అది ప్రత్యుదయం అభ్యుదయం సూచిస్తుంది. మానవాభ్యుదయానికిది మంగళతోరణం. సూర్యచరణం సర్వమంగళాచరణం సుమా!

ఇది ఉదయం బ్రహ్మమయం. మధ్యాహ్నం మహేశ్వర స్వరూపం. సాయంకాలం విష్ణురూపం. సూర్యజ్యోతి ఒక జ్ఞానజ్యోతి. ఇది మహోన్నతం మహోజ్జ్వలం. సూర్యధామంలో తమస్సనేది తలఎత్తదు. అజ్ఞానం కనిపించదు.

సాధారణుల యిచ్ఛ ఎన్నికోరికలు తీరినా తనివినొందనిది. అభ్యుదయంలో హర్షించి ఆపదలో దుఃఖించేది. కొంచెం జ్ఞానం కలిగినా అజ్ఞానంచేత తరచు తిరస్కరింపబడేది. కాని ఈ రవి రుచి వీటికి వ్యతిరేకం. ఈ భాస్కరరుచి మీ అభిరుచులను నెరవేర్చుగాక.

★ ★

“సూర్యాయ విశ్వచక్షసే”

—తైత్తిరీయం

## 23. శ్లోకం

బిభ్రాణ శ్శక్తిమాశు ప్రశమితబలవత్తారకోర్జిత్యగుర్వీం
కుర్వాణో లీలయాధశ్శిఖినమపి లసచ్చంద్రకాంతావభాసమ్
ఆదధ్యాదంధకారే రతిమతిశయినీమావహన్వీక్షణానాం
బాలో లక్ష్మీమపారామపర ఇవ గుహో౽హర్పతేరాతపో వః

### పద్యం

తారకాసురుని సంహారమ్ముగావించ
శక్తిబూనినవాడు షణ్ముఖుండు
తారకతేజమ్ము దబ్బరచేయగా
భగవానుడగువాడు భాస్కరుండు
చంద్రరమ్ములనొప్పు చక్కనినెమలిపై
ఊరేగువాడు కుమారవిభుడు
చంద్రాగ్నిదివ్యతేజస్సులు హరియించి
భాసిల్లువాడు ప్రభాకరుండు

అంధకారియొకడు – అంధకార ధ్వంసి
చక్రనేత్రసౌఖ్యశాలి యొకడు.
అర్క గుహులలోన అంతరమేలేదు
సాదరముగ పలుకు స్వాగతమ్ము !

## వ్యాఖ్య

అదిగో! దర్శించండి! అది భానుని బాలాతపం. అది ఎంత అందంగా ఉంది! అది అచ్చంగా బాలకార్తికేయ ప్రతాపంవలె భాసిస్తున్నది.

బాలాతపం తనశక్తి యుక్తులతో తారక తేజః పుంజాలను పటాపంచలం చేసింది. కుమారస్వామి ప్రతాపం బలవంతుడైన తారకుని రాక్షస బలాన్ని సంహారంచేసింది. తారకులంటే ఇద్దరికీ విరోధమే.

బాలాతపం చంద్రాతపాన్నీ అగ్నితాపాన్నీ తన ప్రతాపం ముందు పనికిరాకుండాచేసింది. కుమారస్వామి ప్రతాపం చంద్రకములతో తేజరిల్లే శిఖిని అధీనం చేసుకొన్నది. అంటే నెమలికన్నులతో ప్రకాశించే నెమలిని వాహనంగా చేసుకొన్నాడు. శిఖి అంటే అగ్ని అని నెమలి అని రెండర్థాలు.

బాలాతపం అంధకారంలోఉన్న వీక్షణాలకు అమితాహ్లాదం కలుగజేసింది. వి అంటే పక్షుల ఈక్షణాలకు అంటే చూపులకు అని అర్థం. అంటే బాలభాస్కర కిరణాలు చక్రవాలకు ముదం చేకూర్చింది అని. కుమార ప్రతాపం అంధకారి అయిన ఈశ్వరుని వీక్షణాలకు అమితానందం కలిగించింది.

ఇలా బాలాతపం కుమార ప్రతాపంవలె మీకు శుభములను దూర్చుగాక!

 

"సువర్ణ సదృశః"

## 26. శ్లోకం

జ్యోత్స్నాంశాకర్షపాండుద్యుతి తిమిరమషీశేషకల్మాషమీష
జ్జృంభోద్భూతేన పింగం సరసిజరజసా సంధ్యయా శోణశోచిః
ప్రాతః ప్రారంభకాలే సకలమివ జగచ్చిత్రమున్మీలయంతీ
కాంతి స్తీక్ష్ణత్విషోఽక్ష్ణాం ముదముపనయతాత్తూలికేవాతులాం వః

## పద్యం

ప్రాభాత పరిమళ పవనగుంఫితమైన
చల్లని వెన్నెల తెల్లదనము
తిమిరసుందరి మషీరమణీయమగు పట్టు
పల్లెవాటు చెరంగు నల్లదనము
వికచారవిందాలు వెలువడి కించిత్తు
వచ్చిన పుప్పొడి పచ్చదనము
ఉభయసంధ్యలలోన శుభముగీలించి
ఇంపుసొంపులు నింపు ఎర్రదనము

చిత్రకారుని రంగుల చిత్రమట్లు
జగతిపటముపై కనుపించె సత్యశోభ
ఉజ్జ్వలంబయ్యె నవ్య సూర్యోదయమ్ము
అనుజ ! పల్కుమా ! వేగమ్ము స్వాగతమ్ము

## వ్యాఖ్య

అదుగో! "పొడుస్తూన్న బాలుడూ పొన్నపువ్వుఛాయ." లోకబాంధవుడు చిత్రభానుడుసుమా! విచిత్రమూ పవిత్రమూఅయింది త్రయీతనువు కాంతి. నానావర్ణకిమ్మీరం అదితిదీప్తి. ఇది సత్యం నిత్యం.

ఉదయ ప్రారంభసమయంలో చల్లని వెన్నెల తెల్లదనం వ్యాపిస్తున్నది. అదేసమయంలో ప్రభాత పరిమళాలు ప్రసరిస్తున్నాయి. మరొకవంక తిమిరసుందరి మషీశేషముయొక్క నల్లదనం ఆమె అలంకరించుకొన్న రమణీయమైన పట్టు వల్లెవాటు చెరగువలె భాసిస్తున్నది.

మధ్యాహ్నం అవుతున్నది. కమలాలు బాగా వికసించాయి. పుప్పొడి విరజిమ్ముతున్నాయి. అది పచ్చగా ఉంది. పసిమిరంగులో బంగారంముద్దవలె నేలతల్లి మెరుస్తున్నది. ప్రకృతి పుప్పొడి రంగులో పచ్చగాఉంది. సంధ్యాసమయం అయింది సంజకెంజాయలు వ్యాపించాయి. పశ్చిమాంగన తన ప్రాంగణంలో పసుపు నీళ్ళు చల్లినట్లున్నది. చిత్రభానుడి కుంచె నుంచి ప్రపంచ చిత్రం అందంగా దర్శనమిస్తున్నది.

 

"సర్వభవోద్భవాయ నమః"

27. శ్లోకం

ఆయాంతీ కిం సుమేరోస్సరణిరమణితా పద్మరాగైః పరాగై
రాహోస్విత్స్యందనస్య మాహార జనవిరచితా వైజయంతీరథస్య
మాంజిష్ఠీ ప్రష్ఠవాహావళివిధుతశిరశ్చామరాళీ ను లోకై
రాశంక్యాలోకితైవం సవితురఘనుదే స్తాత్ప్రభాత ప్రభా వః

పద్యం

పద్మరాగ పరాగపటలిగ్రమిన సుమే
రు గిరీంద్ర మార్గ తారుణ్యమేమొ !
కౌసుంభరాగ సంక్రాంతభూషిత సూర్య
రథ శిఖర పతాకరాజమేమొ !
సప్తాశ్వరాజ శీర్ష మనోజ్ఞ మాంజిష్ఠ
తరళ చామర సముదాయమేమొ !
ప్రాచీనసుందరీ ఫాలభాగముపైని
కమనీయ కుంకుమ కాంతులేమొ !

జనులు వీక్షింప పెక్కు ఆశంక లొదవ
దివ్యకిరణాలు నాలుగుదిశల గ్రమ్మ
సూర్య తేజస్సు లవిగొ ! ఆశ్చర్యకరము
అనుజ ! పల్కుమా ! వేగమ్ము స్వాగతమ్ము

## వ్యాఖ్య

ఆహా! ఏమి ఆ రత్నప్రభలు! కెంజాయలూ, క్రౌంజాయలూను వెల్లివిరిసినట్లున్నది.

ఆ కనిపించేది సుమేరు పర్వత ప్రాంతంగా ఉన్నది. అవి పద్మరాగ మణుల ధూళులవలె కనిపిస్తున్నాయి. ఆ పద్మరాగమణుల ధూళులచేత ఎఱ్ఱబడిన సుమేరు పర్వతంనుంచి వచ్చే మార్గమా అన్నట్లున్నది ఆ అరుణరాగ రంజిత కలాపం.

కాబోతే అది కౌసుంభరాగ పరాగ కాంతిలో భాసించే రవిరాజకేతనం అయియుండవచ్చు. అందుకే అంతరమణీయంగా కనిపిస్తున్నది.

అదిగో! సూర్యరథం. సప్తసైంధవాలు పరుగులు తీస్తున్నాయి. ఆ కనిపించేకాంతులు అశ్వ శిరోభాగాలపై విరాజిల్లే చామర కాంతులు అయియుంటాయి. అవి మాంజిష్ఠరాగరంజితాలు.

అవి ప్రాక్దిశాకాంత ఫాలభాగంపైని కుంకుమములు కాబోలు, బంగారు కాంతులు మెరుస్తున్నాయి. అవి ప్రజలకు సౌభాగ్య ప్రదీపకాలుకదా!

★ ★

“స్వర్ణరేతా దివాకరః”

## 28. శ్లోకం

ధ్వాంతధ్వంసం విధత్తే న తపతి రుచిమన్నాతిరూపం వ్యనక్తి
న్యక్త్వం నీత్వాపి నక్తం న వితరతితరాం తాపదహ్నాస్త్విషం యః
స ప్రాతర్మా విరంసీద సకలపటిమా పూరయన్నుష్మదాశా
మాశాకాశావకాశావతరణ తరుణ ప్రక్రమోఽర్క ప్రకాశః

పద్యం

అజ్ఞానతిమిరమ్ము హరియించువాడయ్యు
తాప ముద్ధృతముగా చూపకుండు
ఘనతర కాంతి ప్రకాశించువాడయ్యు
స్వస్వరూపము వెదజల్లకుండు
పూర్ణమౌ రాత్రిని పోద్రోలువాడయ్యు
పగటిని మాత్రమ్ము దాయకుండు
ఆకాశ రాజ్యమ్ము వ్యాపించువాడయ్యు
పెద్దవెలుంగు చూపింపకుండు

గురువు శిష్యునజ్ఞానమ్ము హాల్చురీతి
తన మహాశక్తి చూపక తగినరీతి
ప్రజకు నుపకారమొనరించు రవికరమ్ము
అనుజ ! పల్కుమా ! వేగమ్ము స్వాగతమ్ము

## వాక్యం

సూర్యదేవుడు సద్గురుపర్యాడు. ఆయన ఆగమన సూచకాలు తమో వినాశకాలు, జ్ఞాన ప్రదీపకాలు.

బాలభానుడు లోకంలో వ్యాపించిన గాఢ తమస్సును హరింపజేస్తాడు. కానీ ఇతరులకేమాత్రం కూడా తాపం కలిగించడు. అలానే సద్గురువు కూడా తాను అజ్ఞాన తమోరహితుడై తన శిష్యుల అజ్ఞానాన్ని అంతం చేస్తాడు తప్ప వారికి మనస్తాపం కలిగించడు.

ఖద్యోతుడు కాంతిధాముడయినప్పటికి తన స్వయం ప్రకాశాన్ని అతిగా ప్రజానీకంపై ప్రదర్శించడు. అదేమాదిరిగా అమిత విజ్ఞాన సంపన్నుడైన గురువు తన జ్ఞాన తేజస్సును క్రమ రహితంగా ప్రదర్శించడు. అది శిష్యునికి జీర్ణమయ్యే క్రమ పద్ధతి లోనే నిదానంగా బోధిస్తాడు.

సహస్రాంశువు రాత్రిని రాత్రించకుల్ని పారద్రోలతాడు. అయినా పగటిని గర్వంతో అతిశయింపనీయడు. అదే తీరుగా గురుపర్యుడు విపక్షుల్ని ఓడించి పరాభూతుల్ని చేస్తాడు. కానీ స్వపక్షులైన ఛాత్రకోటిని గర్వమొందనీయడు.

గురువు జ్ఞానప్రభాకరుడు. సూర్యుడూ గురుపర్యుడూ ఇద్దరూ ఒక్కరే. వారి జ్ఞాన దీప్తిలో ప్రపంచం వర్ధిల్లుతున్నది.

★ ★

"విశ్వభావనాయ నమః"

## 29. శ్లోకం

తీవ్రం నిర్వాణహేతుర్యదపి చ విపులం యత్ప్రకర్షేణ చాణు
ప్రత్యక్షం యత్పరోక్షం యదిహ యదపరం నశ్వరం శాశ్వతంచ
యత్సర్వస్య ప్రసిద్ధం జగతి కతిపయే యోగినో యద్విదంతి
జ్యోతి స్తద్ద్విప్రకారం సవితురవతు వో బాహ్యమాభ్యంతరం చ

### పద్యం

నిరుపమ భోగ్యమ్ము నిర్వాణ సౌఖ్యమ్ము
సువిశాల మత్యంత సూక్ష్మతమము
భావపరోక్షమ్ము ప్రత్యక్షదైవమ్ము
నశ్వరంబును స్థిర శాశ్వతమ్ము
అతిదూర మతిసన్నిహితము నగమ్యంబు
ఆనందకరము అత్యద్భుతమ్ము
సర్వప్రజావళి సకలమెరిగినది
ధీమంతులకె కొంత తెలిసినదియు

ఐహికమ్ముగా మిగుల ఆధ్యాత్మికముగ
రెండు విధముల దీపించుచుండువాడు
సూర్యదేవుడు - దినకరజ్యోతు లవిగో
అనుజ! పల్కుమా! వేగమ్ము స్వాగతమ్ము !

## వ్యాఖ్య

సూర్యభగవానుని తేజస్సు రెండు విధాలుగా ప్రవర్తిల్లుతుంది. బాహ్యము అభ్యంతరము అని రెండు మార్గాలుగా పయనిస్తుంది. ఇందులో మొదటిది బహిరింద్రియ గోచరమైనది. రెండవది యోగసమాధిలోనే గోచరిస్తుంది.

సూర్యశక్తి పైకి తీవ్రంగా కనిపిస్తుంది. యోగదృష్టితో ఆలోచిస్తే ఆ తేజస్సు నిర్వాణ కారణంగా భాసిస్తుంది. ఒకే కాంతి అతి స్థూలమూ అతి సూక్ష్మమూ అయింది. అది పరమాణువుకంటే మిక్కిలి చిన్నది, హిమాలయంకంటే పెద్దది.

ఆ సూర్యకాంతి ప్రత్యక్షమూ పరోక్షమూ. సన్నిహితమూ దూరస్థమూ. నశ్వరమూ శాశ్వతమూ. అది జగత్ప్రసిద్ధమూ అతి గోప్యమూ. బహిరింద్రియ గోచరమూ అంతలోనే అంతర్గోచరమూ.

ఆ సూర్యకాంతి బాహ్యంగా ఆలోచిస్తే మానవుల చక్షువులకు కనిపించేది. ఇంకా పరిశీలిస్తే యోగీశ్వరులకు మాత్రమే తెలియబడేది. అది సాధారణదృష్టికి ఐహికంగా, విశేషమైన దృష్టికి ఆధ్యాత్మికంగా కనిపిస్తుంది. ఇటువంటి బాహ్యాభ్యంతర రూపమైన సూర్యతేజం మిమ్మల్ని రక్షించుగాక.

 

"ప్రచండాయ నమః"

30. శ్లోకం

రత్నానాం మంతనాయ ప్రభవతి నియతోద్దేశలబ్ధావకాశం
వహ్నార్దార్వాది దగ్ధుం నిజజడిమతయా కర్తుమానందమిందోః
యత్తు త్రైలోక్యభూషావిధిరఘదహనం హ్లాది వృష్ట్యేశు తద్వో
బాహుళ్యోత్పాద్యకార్యాధికతర మఘతాధేకమేవార్క తేజః

పద్యం

అనుపమాలంకారమై మహాభూషణ
రాజమై పొలుపొందు రత్నకాంతి
గృహశైలవనముల దహియించు గొప్ప దా
హకరాజమై వెల్గు అగ్నికాంతి
అతిశీతలానందగతి యోగ్యభాగ్యమై
సంతోషమొనగూర్చు చంద్రకాంతి
భవనాలవెలుగులు ప్రసరింపజేయుచు
చూపుల కింపొను దీపకాంతి

పాపదాహకమై లోకభవనముల క
లంకృతమ్మయి సృష్టి కాహ్లాదకరము
నై - వివిధకార్యములుగూర్చు అరుణకాంతి
అనుజ! పల్కుమా! వేగమ్ము స్వాగతమ్ము!

### వ్యాఖ్య

సూర్యతేజం ఇతర తేజస్సులకంటె సర్వోపరి. ఆ తేజస్సుకు మించింది మరొకటిలేదు. లోకంలో అనేక తేజస్సులున్నాయి. కాని అవి అన్నీ ఆదిత్య తేజస్సు ముందు దిసికట్టే.

రత్నతేజం అలంకారప్రాయమే. కానీ దానికి దాహశక్తి లేదు ఆహ్లాదమొసగే శక్తిలేదు. దాని ప్రయోజనం పరిమితం. సీమిత ఆనందం అందిస్తుంది. అగ్నిశక్తికి దహించే గుణం ఉన్నదేకాని అది అలంకారమూ కాదూ, ఆనందమూ ఈయదు. ఇదీ పరిమిత ప్రయో జనకారి మాత్రమే.

చంద్రకాంతి శీతలత్వాన్ని ప్రదానం చేస్తుంది. ఆమోదం ఆహ్లాదం కలిగిస్తుంది. కానీ అది స్పష్టమైన అలంకారమూ కాదూ దహనకారీ కాదు. ఇక దీపపు వెలుగు గృహం వరకే పరిమితం.

సూర్యదీప్తి బహు ప్రయోజనకారి. మూడు లోకాలకు అలంకారం. జీవకోటికి ప్రాణాధారం. అంధకారానికి అజ్ఞానానికి అంతశ్శత్రువు. పాపజాలానికి దాహకం. ప్రజావాహినికి ఆహ్లాద కారకం.

★ ★

"మహా తేజసేనమః"

## 31. శ్లోకం

మీలచ్చక్షుర్విజిహ్మశ్రుతి జడరసనం నిఘ్నితఘ్రాణవృత్తి
స్వవ్యాపారాక్షమత్వక్పరిముషిత మనః శ్వాసమాత్రావశేషమ్
విస్రస్తాంగం పతిత్వా స్వపదపహరతాదశ్రియం వోఽర్కజన్మా
కాలవ్యాలావలీఢం జగదగదఇవోత్థాపయన్ప్రాక్ప్రతాపః

### పద్యం

కాలమ్ము సర్పమ్ముగతి కాటువేసిన
ఆతని కన్నులు మూతవడును
కాలమ్ము సర్పమ్ముగతి కాటువేసిన
శ్రవణయుగమ్మును చెవుడువడును
కాలమ్ము సర్పమ్ముగతి కాటువేసిన
ఘ్రాణేంద్రియము పిల్చుక్రమముపోవు
కాలమ్ము సర్పమ్ముగతి కాటువేసిన
చర్మమ్మునకు పోవు స్పర్శగుణము

మనసు పనిమాను-శ్వాసమ్ము మాత్రమాడు
విషముతలకెక్క-వానికి వేడివేల్పు
విషహరణ చికిత్సావిధి వేగసేయు
సోదరా! తెమ్ము పూజాప్రసూన వితతి

వ్యాఖ్య

కాలం బలపత్తరమూ అనంతమూ అయింది సుమా! సూర్యదేవుడు దినకరుడు. ఆయన ఇంకా ఉదయించలేదు. అప్పటి పరిస్థితి యిలా ఉన్నది.

రాత్రి సమయం కాలసర్పంవలె ఉన్నది. జనం ఎక్కడి వాళ్ళక్కడ పడిపోయి నిద్రిస్తున్నారు. ఈ జనుల పరిస్థితి చూస్తుంటే కాలసర్పం కాటువేసినట్లున్నది. కాలసర్పదష్టులైన జనుల కన్నులు మూతలుపడ్డాయి. చెవులు దిబ్బడులు పడ్డాయి. చర్మం స్పర్శజ్ఞానం కోలుపోయింది. మనస్సు పనిచేయటంలేదు. అవయవాలు శిథిలమై నాయి. ఒక్క శ్వాస మాత్రం ఆడుతున్నది. కాలసర్పం ఎంతపని చేసింది!

ప్రాతఃకాలం అయింది. జగద్బాంధవుడు కరుణించాడు. సూర్యోదయం అయింది. అరుణకిరణాలు విషహరణాలు. అవిగో! బాలభానుడి బంగారు కిరణాలు. ప్రజలకు అవి బాధాప్రహరణాలు. ప్రజలు మేలుకొన్నారు.

 

"సర్వతాపనాయ నమః"

### 32. శ్లోకం

నిశ్శేషం నైశమంభః ప్రసభమపనుదన్న్ శ్రులేశానుకారి
స్తోకస్తోకాపనీతారుణరుచి రచిరాదస్త దోషానుషంగః
దాతాదృష్టిం ప్రసన్నాం త్రిభువననయనస్యాశు యుష్మద్విరుద్ధం
పథ్యాద్వస్త్రిఘ్నస్య సిద్ధాంజనవిధిరపరః ప్రాక్తనో ఒర్చిః ప్రచారః

పద్యం

తమికాలమున మంచుదట్టమ్ము గాపట్టి
రేరాణి కన్నీటిధారవోలె
భాస్కరుం డిదిచూచి భావించె నెర్రగా
దోషాకరునిదె దుందుడుకుతనము
సంపర్కదోషమ్ము సంక్రమించె నదిగో
ఆననంబు కళావిహీనమయ్యె
కన్నురుజారెడి కామెర్ల జబ్బిది
వేగమ్ము మందులు వేయవలయు

అంచు ఉపకృతి సేయతలంచి ఒసగె
అమలదృష్టి నొసంగు సిద్ధాంజనమ్ము
అవిగో! సూర్యమయూఖాలు అవతరించె
సోదరా! తెమ్ము పూజాప్రసూన వితతి

వ్యాఖ్య

అదుగో! అరుణ మూర్తి ఉదయిస్తున్నాడు. పూర్వరేకలు పొడుస్తున్నాయి. లోకం అప్పుడే కళ్ళు తెరుస్తున్నది.

ఎందుకో! జనులకళ్ళు కాంతివంతంగా లేవే. కళ్ళ నీళ్ళు కారుతున్నాయి ఎర్రబడి ఉన్నాయి.

అదిగో! సూర్యోదయం అయింది. అరుణకిరణాలు వైద్య పరికరాలై పొడుచుకువచ్చాయి. ప్రభాకర వైద్యుడు కళ్ళల్లోకి ఎర్ర సూదులు గుచ్చాడు. సూదుల మందు వేశాడు.

రాత్రి కురిసిన మంచుబిందువుల్ని కన్నీటి బిందువులనువలె తొలగించాడు సూర్యుడు. కొంచెం ఉన్న ఎఱ్ఱదనాన్ని పోగొట్టి, సంబంధ దోషాలను కామెర్లవంటి కంటి దోషాలను వదిలించి ముల్లో కాల కన్నులకు నిర్మలమైన దృష్టిని ప్రసాదిస్తున్నది సూర్యతేజస్సు. సిద్ధాంజనం వంటి సూర్యునికాంతి ప్రసారం మీ అనిష్టాలను పోగొట్టి ఆరోగ్యాన్ని ప్రసాదించుగాక.

★ ★

"తమోభేదినే నమః"

## 33. శ్లోకం

భూత్వా జంభస్య భేత్తుః కకుభి పరిభవారంభభూశ్శుభ్రభానో
ర్విభ్రాణా బభ్రుభావం ప్రసభమభినవాంభోజ జృంభాప్రగల్భా
భూషాభూయిష్ఠశోభా త్రిభువనభవనస్యాస్య వై భాకరీ యా
విభ్రాంతిభ్రాజమానా విభవతు విభవోద్భూతయే సా విభా వః

## పద్యం

ఆనందకరముగా ఆఖండలుని దిశన్
ముదమార శుభముగా ఉదయమంది
రోషమ్ముతో జూచి దోషాచరుని బట్టి
రాజమార్గమ్ముపై పరాభవించి
గుణములోనేకాక గోత్రమ్ముపై మించి
నవ్య కాషాయవర్ణము వహించి
బహుమూరమందున్న పంకజాల్ ప్రోచి జ
గద్బాంధవుడను విఖ్యాతివడసి

మిత్రుడై మూడుజగముల మేలుచేసి
భువనభవనమ్ములకు మహాభూషణమయి
సుప్రకాశమ్ము వెదజల్లె సూర్యదీప్తి
సోదరా! తెమ్ము పూజా ప్రసూనవితతి.

## వ్యాఖ్య

అవిగో ! రవి ప్రభలు తూర్పుకొండపై రాబోతున్నాయి. జయం జయం.

లోకంలో అరివర్గం ఎక్కువయింది. విపక్షులు స్వపక్షుల్ని బాధిస్తున్నారు. అయినవారినీ, ఆపదల్లో చిక్కుకొన్నవారినీ ఎలా ఆదుకోవాలా అని ఆలోచిస్తున్నాడు ఆదిత్య నిత్యసత్యవ్రతుడు.

ప్రభాకరుడు పన్నిన వ్యూహం ఫలించింది. రవి ముందుగా మహేంద్రుని పక్షంచేరి ఆ దిశనుంచే దాడి ప్రారంభించాడు. అరుణ కిరణాలు అనే వాడి బాణాలు సంధించి యుద్ధం చేశాడు. అంధకాసురుడు హతాశుడయ్యాడు. చంద్రుడు పరాభూతుడయ్యాడు.

దినకరస్వామికి త్రిభువన విజయం లభించింది. రవిరాజు అనురాగ రంజితుడయ్యాడు. పద్మాలను లాలించి వాటిని వికసింప చేశాడు. అందరికీ ఆశ్చర్యం ఆనందం అయింది. రవి త్రిభువన భూషణమై రాజించాడు. పద్మినీ వల్లభుడు లోకబాంధవుడై ప్రకాశించాడు.

 

"భానవే నమః"

### 34. శ్లోకం

సంసక్తం సిక్తమూలాదభినవ భువనోద్యానకౌతూహలిన్యా
యామిన్యా కన్యయేవామృతకరకలశావర్జితేనామృతేన
అర్కాలోకః క్రియాద్వో ముదముదయశిరశ్చక్రవాళాలవాలా
దుద్యన్బాలప్రవాళ ప్రతిమరుచిరహః పాదపప్రోత్ప్రవాళః

### పద్యం

భువనమ్ము నుద్యానభూమిగా పోషింప
ముగ్ధవిభావరి పూనుకొనెను
అమృతాంశుబింబమ్ము అమృతభాండముచేసి
జలములు సర్వత్ర చిలకరించె
బంగారునాగళ్ళ పదునైనరీతిలో
ఉదయపర్వతభూమి పాదుచేసె
దినవృక్షమును నాటి తేజరిల్లుచునుండ
వెలుగులచెట్టుకు బలమువెట్టె

అంత పెరుగసాగిన చెట్టు అందగించి
లేత చిగురాకుజొంపాలు పూతపెట్టె
భువనమెల్లను బంగారు భవనమయ్యె
సోదరా ! తెమ్ము పూజా ప్రసూన వితతి

వ్యాఖ్య

రేరాణికి ఒక కుతూహలం కలిగింది. భువనాన్ని ఉద్యాన వనం చేసుకొంటే ఎంత అందంగా ఉంటుంది అనిపించింది.

ఆమె అమృతకిరణుణ్ణి జలకలశంగా స్వీకరించింది. భువనమంతా అమృతమనే జలంతో తడపసాగింది. చల్లని అమృత కిరణాలు చక్కని జలధారలుగా భాసిస్తున్నాయి.

ఉదయ పర్వత శిఖరాల ప్రాంతాన్ని ఆ కాంత పాదుగా చేసుకొన్నది. అందులో దిన వృక్షాన్ని జాగ్రత్తగా నాటింది. ఆ వృక్షం చిగురాకులు తొడిగింది. అరుణ పల్లవాలు అందగించాయి. ఆ పల్లవ ప్రవాళ కాంతులు దశదిశల వ్యాపించాయి. లోకం కుంకు మాంకితమయింది.

★ ★

"హరిదశ్వాయ నమః"

### 35. శ్లోకం

భిన్నం భాసారుణస్య క్వచిదభినవయా విద్రుమాణాం త్విషేవ
త్వంగన్నక్షత్రరత్నద్యుతి నికరకరాళాంతరాళం క్వచిచ్చ
నాంతర్నిశ్శేషకృష్ణశ్రియముదధిమివ ధ్వాంతరాశింపిబన్ స్తా
దౌర్వః పూర్వోఽప్యపూర్వోఽగ్నిరివభవదఘప్లుష్టయేఽర్కావభాసః

### పద్యం

అరుణకాంతులుచిమ్మె అందాల పవడాలు
ముంగిటిలో ఆరబోసినట్లు
నక్షత్రములువెల్గె నవ్యనవ్యమ్ముగా
మిలమిల రతనాలు మెరసినట్లు
అంధకారము సందుసందులనిలిచెను
హరినీల మణులెల్ల పరచినట్లు
నులివెచ్చనైన కాంతులు ప్రాకుచుండెను
అంభోధిలో బడబాగ్నియట్లు

వేయిచేతులరేడు విచ్చేయుచుండె
ఆశలన్నియు నవ్య దివ్యాతిదివ్య
తేజములునిండె కడుదిద్దితీర్చినట్లు
సోదరా! తెమ్ము పూజా ప్రసూన వితతి

వ్యాఖ్య

అదిగో !సూర్యోదయం అయింది. స్వామి సహస్రకిరణాలు సువర్ణ ఆభరణాలై వసుంధరను అలంకరించాయి. ఆ కిరణకాంతులు అనేకరకాలు. ఎంతబాగున్నాయి !

ఆ సూర్యదేవుని కిరణాలు భువన భవన ప్రాంగణంలో ఒకచోట పగడాలు ఆరబోశాయి. అవే మయూఖాలు మరోచోట నక్షత్రాలనే రతనాలరాసులవలె మిలమిల మెరుస్తున్నాయి. హరినీల మణులు పరచినట్లు అంధకారం అక్కడక్కడ విలసిల్లుతున్నది. అంతర్నిశ్శేషకృష్ణశ్రీలతో ఆ దృశ్యం వినూతనంగా ఉన్నది.

మరికొంతసేపు చూడగా చిమ్మచీకటి అనే సముద్రాన్ని బడబాగ్ని నోరుతెరచి గ్రహిస్తున్నదా అనే ఊహ కలుగుతున్నది. ఇలా ఆదిత్య సత్య తేజస్సు వివిధ భంగిమల్లో దృశ్యమానం అవుతున్నది.

★ ★

"అగ్నిగర్భాయ నమః"

### 36. శ్లోకం

గంధర్వైర్గద్యపద్యవ్యతికరిత వచోహృద్యమాతోద్యవాద్యైః
ఆద్యైర్యో నారదాద్యైర్మునిభిరభినుతో వేదవేద్యైర్విభిద్య
ఆసాద్యాపద్యతే యంపునరపి చ జగద్యౌవనంసద్య ఉద్య
న్నుద్యోతో ద్యోతితద్యౌర్ద్యతు దివసకృతోఽసావవద్యాని వోఽద్య

### పద్యం

కమనీయ గణనీయ గద్యపద్యాత్మక
 కవితావిలాస వాక్యములతోడ
సంగీత గీతార్థసార వీణావేణు
 తాళ మృదంగ వాద్యములతోడ
మధురార్థ మానస మాంగల్య నిర్భర
 సవ్యాతినవ్య గానములతోడ
విశ్వమంగళకళా విస్తార విపులార్థ
 తత్త్వవేదాంత వాదములతోడ

నారదాదుల సంకీర్తనములతోడ
రంభనృత్యమ్ముతోడ ఆరంభమైన
రంగమునకు విచ్చేసె సూర్యకరదీప్తి
సోదరా ! తెమ్ము పూజాప్రసూన వితతి

[illegible]

అదుగో! మహానుభావుడు సూర్యనారాయణుడు వస్తున్నా డంటే లోకమంతా చైతన్యంతో పులకించిపోతున్నది.

గద్య పద్య మధుర గేయాలతో కవీశ్వరులు సూర్యస్తుతి చేస్తున్నారు. వీణా తాళ మృదంగ వేణు వాద్యముల నినాదాలతో గంధర్వులు మనోహరంగా గానం చేస్తున్నారు. అవి మంగళ మహిత ములై పరమానందాన్ని కలిగిస్తున్నాయి.

వేదవేత్తలు జటపనసలు పఠిస్తున్నారు. తత్త్వవేత్తలైన నారదాది మహర్షులు తన్మయత్వంతో సంకీర్తన గావిస్తున్నారు. లోకా నికి మరల నవ యవ్వనం వచ్చినట్లయింది.

కమల బాంధవుని కమనీయమైన ఉదయ కాంతులు లోకా నికి నవాలోకాన్ని కలిగిస్తున్నది. అదిగో తూర్పుకొండపై పసుపు కుంకుమల కాంతులు ప్రసరిస్తున్నాయి.

★ ★

"కవమే నమః"

## 37. శ్లోకం

ఆవానైశ్చంద్రకాంతైశ్చ్యుతతిమిరతయా తానవాత్తారకాణా
మేణాంకాలోకలోపాదుపహతమహసామోషధీనాం లయేన
ఆరాదుత్ప్రేక్ష్యమాణా క్షణముదయతటాంతర్హితస్యాహిమాంశో
రాఘా ప్రాఘాతకీ వోఽవతు నతు నితరాం తావదావిర్భవంతీ

### పద్యం

చలువ చెమ్మలతోడ చక్కందనాల్ చిందు
చంద్రకాంత శిలావ్రజమ్ముచేత
అంధకారంబెల్ల హరియించి పలుచనై
కనిపించు నక్షత్రగణముచేత
చంద్రికల్ లోపించి చల్లని వెలుగులో
చాటుయిపోవు ఓషధులచేత
సల్లరంగులువోయి మెల్లగావ్యాపించు
కాషాయవర్ణ సంక్రాంతిచేత

దిక్కులురహింప ఉదయాద్రి ఒక్కతూరి
సాగిరాకుండగా ఆగిఆగి మంద
హాస రుచితోడ రవితేజ మరుగుదెంచె
సోదరా ! తెల్పు పూర్వాప్రసూన వితతి

## వ్యాఖ్య

అడుగో! వేయి చేతుల వేల్పు రాబోతున్నాడు. తూర్పు తెలతెలవారుతున్నది. వెలి తొలిరేకలు విచ్చుకొంటున్నాయి.

కొండలమీద చంద్ర కాంతులకు చంద్రకాంతశిలలు చల్లగా ద్రవిస్తూండేవి. సూర్యదేవుడు వస్తున్నాడని ఆ శిలలు చెమర్చటం మానుకొన్నాయి. ఇంతవరకు చిక్కగా అలముకొన్న చిమ్మచీకటి విచ్చుకొన్నది. చుక్కలు పలచబడ్డాయి. చందమామ వెలుగులు సన్నగిల్లాయి. ఓషధులు కాంతిహీనములయ్యాయి. సూర్యుడు వస్తున్నాడంటే చంద్రుడు తన బలగంతో ఆకాశరాజ్యంనుంచి నిష్క్రమిస్తున్నాడు.

ఉదయాద్రి శిఖరాలమాటున అదిగో ఆదిత్యకాంతి కనిపిస్తున్నది. స్పష్టంగా అనిపించటంలేదు కానీ ఆ వెలుగులు కమలాకరుడి కమనీయకాంతులే! ఆ రంగురంగు కిరణాలు అవే.

ఉష్ణరశ్మి ఉదయకాంతులు ప్రజలకు కన్నుల పండువ చేస్తున్నాయి.

★ ★

"పద్మప్రబోధాయ నమః"

## 38. శ్లోకం

సానా సా నాదయేనారుణిత దశపునర్వ్యవనానాం వనానా
మాలీమాలీఢపూర్వా పరిహృతకుహరోపాంతనిమ్నా తనిమ్నా
భా వో భావోపశాంతిం దిశతు దినపతేర్భాసమానా సమానా
రాజీ రాజీవరేణోస్సమ సమయముదేతీవ యస్యా వయస్యా

### పద్యం

ఎవ్వానితో వచ్చు నిట పద్మరాగాలు
సంతోష సమయాన సఖులభాతి
ఎవ్వాని సువిశాల హృది రాగరంజితం
బగు పునర్యౌవ్వనమందినట్లు
ఎవ్వాని కరములు ఇంపుగాసాగి వ
న లతాంగి నాలింగనమ్ము సేయు
ఎవ్వాని పాదాలహీనమ్ములందుచు
పరిమళించును నిమ్నపరిసరాలు

అతడు గ్రహపతి దినపతి అంశుమాలి
అదిగో! భాస్కరదేవుని అరుణకాంతి
వచ్చుచున్నది తూర్పు పర్వతమునుండి
సోదరా! తెమ్ము పూజాప్రసూన వితతి

## సాహిత్య

అవిగో! అరుణారుణ సూర్యప్రభలు. ఆ ఉదయాద్రి సానువులపై స్వర్ణరుచులు వ్యాపించాయి. ఆ ప్రభలు దిశాంగనలకు పసుపుకుంకుమలు పంజారం చేస్తున్నాయి.

రవిప్రభలపై ప్రేమతో పద్మారాగాలు వచ్చాయి. అవి వాటితోపాటు పర్వతసానువులపై విహారం చేస్తున్నాయి. బాలభాను డుదయించగానే వనం యవ్వనం పొందినట్లుంది. వనంలోని అరుణపత్ర కాంతులు దేదీప్యమానంగా మెరిసి హసిస్తున్నాయి.

అరుణప్రభలు తన ప్రౌఢతచేత ఇంకా విజృంభింపక గుహాభ్యంతరాలను నిమ్నప్రదేశాలను పరిహరిస్తున్నాయి. లోకబాంధ వుడు కిరణరాజితో దశదిశలను సమానంగా భాసమానం చేస్తూ దయ చేస్తున్నాడు.

అందరికీ ఆనందం అందించే విధంగా సూర్యప్రభలు ప్రకా శిస్తున్నాయి. సూర్యోదయ సమయం అటువంటి ప్రభావసంపన్న మయింది.

 

"ఆదిత్యాయ నమః"

39. శ్లోకం

ఉజ్జృంభాంభోరుహాణాం ప్రభవతి పయసాం యా శ్రియైనోష్ణతాయై
పుష్టాత్యాలోకమాత్రం నతు దిశతి దృశాం దృశ్యమానావిఘాతమ్
పూర్వాద్రేరేవ పూర్వం దివమను చ పునః పావనీదిఙ్ముఖానా
మేనాంస్యైనీ విభా సా సుదతు నుతిపదైకాస్పదం ప్రాప్తనీ వః

పద్యం

సరసీరుహాలున్న జలరాశి కెప్పుడు
బహుశోభనములె తాపమ్ము లేదు
చారునేత్రాలున్న దూరదృష్టికి నెప్పు
బహుసౌఖ్యములె కాని బాధ లేదు
అటవీవనాలున్న బాటసారికికూడ
మార్గమే మరి దుర్గమమ్ము లేదు
ధర్మయుద్ధాలున్న కర్మశీలుర కెప్డు
స్వర్గమేకాని నాశమ్ము లేదు

అట్టి కరుణాకరుండు అహస్కరుండు
మొదట ప్రాచీన శిఖరిపై పిదప దివము
దిశలు పూతమ్ముగా అరుదెంచినాడు
సోదరా! తెమ్ము పూజాప్రసూన వితతి

వ్యాఖ్య

అడుగో! పద్మినీవల్లభుని రాకను సూచిస్తూ అరుణజ్యోతులు ముందుగా దర్శనమిస్తున్నాయి. ఆ సమయంలో ప్రకృతి ఆహ్లాద కరంగా ఉన్నది.

అంభోరుహ విజృంభమాణం వలన అంభస్సుల శోభ లక్ష్మీ వంతమవుతున్నది. అరవిందబాంధవ మధురావలోకనం వలన ఉష్ణ రశ్మి బాధ కలిగించటంలేదు.

సూర్యకాంతిలో ప్రకృతి దృశ్యాలు చూడటానికి కడు శోభాయమానంగా ఉన్నాయి. సూర్యకిరణాలు కన్నులలోకి గ్రుచ్చి నొప్పి కలిగించటంలేదు. ఉదయ వాతావరణం అభ్యుదయకరంగా హాయిగా ఉన్నది.

ఆ సుందర సూర్యకాంతి మునుముందు తూరుపుకొండ నెత్తమ్ములకు పసుపుకుంకుమలతో పూజ చేస్తున్నది. ఆ తరువాత ఆ కాంతి దిఙ్ముఖాలను అలంకరిస్తున్నది. ఇలా సూర్యప్రభలు స్తుతి యోగ్యాలై ప్రజల పాపాలు పటాపంచలు చేస్తున్నాయి.

★ ★

"సహస్రాంశవే నమః"

### 40. శ్లోకం

వాచాం వాచస్పతేరప్యచలధి ధుషితాచార్యకాణాంప్రపంచైః
వైరించానాం తథోచ్చారితరుచిషుచ్చాం చాననానాం చతుర్ణామ్
ఉచ్చైతారాప్సను వాచ్యచ్యుతిశుచి చరితంయస్య నోచ్చైర్వివిచ్య
ప్రాచ్యం పర్ప్రశ్చకాసచ్చిరముపచినుతా త్తస్య చండార్చిషో వః

పద్యం

అతిపవిత్రచరిత్ర నందించు దీక్షతో
ఇంద్రున కుపదేశ మియకలుగు
ఆచార్యవరుడు బృహస్పతి మహనీయ
సురుచిర మధుర వాక్సుధలచేత-
సరసీరుహాసను చతురాననమ్ముల
ఉజ్జ్వలమహిమతో ఉదయమంది
పాపజాలమ్మును ప్రక్షాళనముసేయు
అతిపూత ఋక్సమూహమ్ముచేత-

సంస్తుతులనంది స్వర్ణతేజస్సులంది
మొట్టమొదటగా తూరుపుమెట్టునెక్కి-
అదిగో! వచ్చుచున్నది భాస్కరు నరుణదీప్తి
సోదరా! తెమ్ము పూజాప్రసూన వితతి

వ్యాఖ్య

అదుగో! సూర్యభగవానుడు ఉదయిస్తున్నాడు. ప్రజలారా! దేవతలారా! స్వాగతం చెప్పండి. స్వస్తి పలకండి.

ఈ ఆదిత్యుడు సామాన్యదేవుడు కాడు. సకల దేవతలకు అధిపతి. దేవేంద్రుడికి ఆరాధ్యుడితడు. మహాంత వాచస్పతి వాక్కులందు కూడా ఆయనను వర్ణించనలవికాదు. బృహస్పతికూడా ఈ ఆదిత్య సత్యతేజస్సు నిత్యమహత్వాన్ని వర్ణించలేడు. అంత గొప్పవాడు ఈ ద్వాదశాదిత్యుడు.

బ్రహ్మదేవుని నాలుగు ముఖాలనుంచి నాలుగు వేదాలు ఉదయించాయి. ఆ వేదమంత్రాలు పాపాలను పారద్రోలగల శక్తి సంభరితములైనవి. ఆ వేదాలుకూడా ఈ ద్వాదశాదిత్యుని మహత్తు ఇట్టిదని వివరించజాలవు.

ఈ ద్వాదశాదిత్యుడు మనభాగ్యం ఫలించి నేడు మన ముందుకు ఉదయిస్తున్నాడు. దర్శించి తరించండి.

★ ★

"ద్వాదశాత్మనే నమః"

## 41. శ్లోకం

మూర్ధ్న్యద్రేర్ధాతురాగ స్తరుషు కిసలయో విద్రుమౌఘస్సముద్రే
దిఙ్మాతంగోత్తమాంగేష్వభినవ నిహితస్సాంద్రసిందూరరేణుః
సీమ్ని వ్యోమ్నశ్చ హేమ్నస్సురశిఖరి భువో జాయతే యః ప్రకాశః
శోణిమ్నాసౌ ఖిలాంశోరుషసి దిశతువశ్శర్మ శోభైకదేశః

### పద్యం

పర్వతశిఖరాలపై తళత్తళలాడు
గైరికధాతు సంఘమ్ము వోలె
తరురాజశాఖికాశిరముల అందాలు
చిందాడు సుమలేత చివురువోలె
అబ్ధితరంగాల సత్యచ్ఛవిమ్ముగా
దాలుచిందెడు పగడాలువోలె
కుంజరేంద్రసమూహ కుంభస్థలాలపై
రవళించు సిందూర రజమువోలె

గగనవీథిపై నవ్యరంగాలుదిద్దు
స్వర్ణ మేరుపర్వత ప్రకాశమ్ము వోలె
కాంతులువెలార్చె అదె ప్రభాకర మరీచి
సోదరా! నెమ్మి పూజాప్రసూన వితతి

## వ్యాఖ్య

అదిగో! అరుణోదయం ఎంత మనోహరంగా ఉన్నది. ఆ కుంకుమాంకిత అరుణ కరుణ కిరణాలు అనేక వినూత్న విశిష్ట భావాలు రేకెత్తిస్తున్నాయి.

అరుణుడేతెంచాడు. ఆయన తేజఃపుంజాలు పర్వతశిఖరాలపై గైరికాది ధాతువుల రక్తిమను చిందిస్తున్నాయి. వృక్షశిఖరాగ్రాలపై కెంజిగురాకులవలె తళతళ మెరుస్తున్నాయి.

ఉదయ సంధ్యాసమయ కిరణసమూహాలు సముద్రంలో ప్రతిఫలించాయి. సముద్రుడు అనురాగ సముద్రుడయ్యాడు. సముద్రునిలో పవడాల సమూహం కాంతులీనుతున్నది. ఆ కిరణాల కాంతి దిగ్గజాల కుంభస్థలాలపై సిందూరపరాగంగా పరిఢవిల్లుతున్నది. అందువల్ల ఆ ఐరావతాలు కుంకుమ కొండలవలె కనిపిస్తున్నాయి.

అది మేరుపర్వతం. ఆకాశాన్ని అపరంజి రంజితం చేసింది. అసలే అది బంగారుపర్వతం. ఈ ఉదయం మరీ శోభాయమానంగా ఉన్నది. ఈ విధంగా ప్రకృతి అంతా సత్య ఆదిత్యమూర్తి రాకవల్ల రాగరంజితమై విలసిల్లుతున్నది.

★ ★

"ఓం రశ్మిమతే నమః"

ప్రకృతి

అదిగో! వేగుచుక్క పొడిచింది. అమృతకరుడు అస్తాద్రి చేరుకొన్నాడు.

కటికచీకటి అనే కాలకూటమంతా ఆపోశనపట్టటంవల్ల కాబోలు అంతరించిపోయింది. అరుణుడు లేజిగురాకు రూపుదాల్చి ఉషఃపారిజాతాలకు కాంతులను ప్రసరింపచేస్తున్నాడు. అరుణ పల్లవాలతో పారిజాతాలు విప్పుకొంటున్నాయి.

ఎఱ్ఱని పసుపువర్ణముతో విలసిల్లే సూర్యకాంతి కమలాలలో ప్రకాశించటం అనురక్తుడయిన పీతాంబరుడు లక్ష్మిని చూస్తున్నట్లుగా ఉన్నది.

ఆ శుభసందర్భంలో దిక్కాంత లందరు హారతితో పసుపు కుంకుమలు పెడుతున్నట్లున్నది. ఆ సూర్యకాంతి శోభ లక్ష్మీపతి అందరికీ అభ్యుదయం అందించుగాక!

* *

"పసుమూర్తయే నమః"

## 43. శ్లోకం

సోదన్యా జ్జన్మభూమిర్న తదు పరభువో బాంధవాః కౌస్తుభాద్యాః
పాణౌపద్మం న యస్యానచ నరకరిపూరస్థలీ వాసవేశ్మ
తేజోరూపాపరైవ త్రిషు భువనతలేష్వాదధానా వ్యవస్థాం
సా శ్రీః శ్రేయాంసి దిశ్యాదశిశిరమహసో మండలాగ్రోద్గతా వః

## పద్యం

సుపవిత్ర సువిశాల సుందర క్షీరాంబు
నిధిలోన ఈమె జన్మింపలేదు
రత్నాకరోత్పన్న రాజకౌస్తుభ భూష
ణములతో వంశబాంధవములేదు
హస్తద్వయమ్ములో అందాలుచిందాడు
తామరపూవులు దాల్చలేదు
శ్రీమహావిష్ణు సుశ్యామల వక్షస్థ
లమ్ముపై స్థిరనివాసమ్ములేదు

లక్ష్మికన్నను లక్షవిలక్షణాలు
మూడులోకమ్ములకు చూపు ముందుచూపు
దీప్తు లెగజిమ్ము ఈమె "ఆదిత్యలక్ష్మి"
సోదరా! తెమ్ము పూజా ప్రసూనవితతి

## వ్యాఖ్య

అదిగో! సూర్యప్రభాలక్ష్మి దర్శనమిస్తున్నది. ఆదిత్యలక్ష్మి ఆదిలక్ష్మికంటె విలక్షణమైనది.

ఆదిలక్ష్మి క్షీరసముద్రంలో జన్మించింది. కడలిలో పుట్టిన కౌస్తుభాదులు ఆమెకు తోబుట్టువులు. ఆ తల్లి కరకమలాలలో కమలాలను విలాసంగా ధరిస్తుంది. శ్రీమహావిష్ణు వక్షస్థలం ఆమె నివాసస్థలం. ఆమె మూడు జగాలకు సంపదలు ప్రదానం చేస్తుంటుంది.

కానీ సూర్యతేజమనే లక్ష్మి ఆ ఆదిలక్ష్మికంటె చాలా విలక్షణంగా కనిపిస్తుంది.

ఈమె పాలసముద్రంలో పుట్టలేదు. ఈమెకు కౌస్తుభాదులు చెలులుకారు. హస్తాలు పద్మాలుకావు. హస్తాల్లోను పద్మాలులేవు. శ్రీవిష్ణు వక్షస్థలం ఈమెకు నివాసభూమికాదు. అయినా ఈ ఆదిత్యలక్ష్మి మూడులోకాలకు సువ్యవస్థ కలిగించి తన తేజస్సుతో శ్రేయస్సులను ప్రసాదిస్తుంది.

 

"మహాతేజసే నమః"

స్వస్తి

అవిగో! సూర్యాశ్వాలు వస్తున్నాయి. ఎంతవేగంగా పరుగిడుతున్నాయి.

అది పర్వత ప్రాంతం. అంత పరిసంగా ఉండే మేరు శైల ఘూమములవి. ఆ ప్రాంతంలో దారి డొంకా లేదు. మార్గానికి ఏ గుర్తులూ లేవు. అవి సూర్యకాంత వేదికలు కాబోలు! మిక్కిలి ప్రకాశంతో మండిపోతున్నట్లున్నాయి.

సూర్యాశ్వాలు బంగారు రాళ్ళకు కాళ్ళు కొట్టుకోనకుండా చాకచక్యంతో పరుగులు పెడుతున్నాయి.

అశ్వాల గమనం చూస్తుంటే గాలితో పందెం వేసినట్లున్నాయి. గాలిని గెలిచేస్తూ గాలికంటే ముందే వెళుతున్నాయి. ఆ సూర్యాశ్వాలు ప్రజలకు శ్రేయస్సులు కలుగజేయుగాక!

★ ★

“సూర్యాశ్వాయ నమః”

## 49. శ్లోకం

ప్లుష్టాః పృష్ఠేఽంశుపాతైరతి నికటతయా దత్తదాహాతి రేకై
రేకాహాక్రాంత కృత్స్నత్రిదివపథ పృథు శ్వాసశోషాః క్రమేణ
తీవ్రోదన్వాస్త్వపంతాం ముహిత విహతయే సప్తయస్సప్త సప్తే
రభ్యాకాశ గంగాజల సరళగళావాహ్యదాగ్రాసనా వః

పద్యం

పృష్ఠ భాగాలను నిష్ఠుర జ్వాలలై
ఖద్యోత తేజముల్ కాల్చివేయ
మిట్ట మధ్యాహ్నమ్ము నిట్టూర్పులను బుచ్చి
ఆకాశమంతయు అరుగుచుండ
మిగుల దప్పికతో సమీపమ్మునందున్న
అభ్రజలాలకై ఆశలొంద
గమనవేగమ్మున గాత్రముల్ స్రుక్క దే
వలము సుదృఢ మనోబలము మిగుల

లోకబాంధవు వెనువెంట లోకసేవ
అంకితంబైన సూర్యుని హయములవిగో
వచ్చుచున్నవి చూడుమా! త్వరితగతుల
రమణి! కొనితెమ్ము పసుపు కుంకుమలు పూలు!

వ్యాఖ్య

అవిగో! రవీంద్రుని అశ్వాలు వేగంగా సాగిపోతున్నాయి. ఆ గుఱ్ఱాలు ఎంత శోభయమానంగా ఉన్నాయి!

సూర్యునికి మిక్కిలి సమీపంలో ఉండటంవల్ల కాబోలు, ఆయన కిరణాల వేడి వాటి పిరుదులకు తగిలి ఆ కలిగిన తాపం వల్ల అవి మరింత వేగంగా పరుగులు తీస్తున్నాయి. పగలంతా మిట్ట మధ్యాహ్న సమయంలోకూడా విశ్రాంతి లేకుండగా ఆకాశమంతా తిరగవలసిరావటంవల్ల ఆ అశ్వాలు దీర్ఘంగా నిట్టూర్పులు విడుస్తు న్నాయి.

అశ్వాలకు దప్పిక అవుతున్నది కాబోలు! అవి ఆకాశగంగ వైపు మెడలు చాస్తున్నాయి. తలలువంచి అటుప్రక్కకే లాగు తున్నాయి. ఆ అశ్వాలశోభ అహరహం ప్రజల అనిష్టాలను తొల గించుగాక!

★ ★

"సప్త సూర్యా దివమను ప్రవిష్టా"

—తైత్తరీయం

### 46. శ్లోకం

మత్వాన్యాన్పార్శ్వతోఽశ్వాన్ స్ఫటికమణిదృషద్దృష్టదేహాంద్రవంతీ
వ్యస్తైః హాన్యత్ర సంధ్యేయమితి మృదుపదా పద్మరాగోపలేషు
సా దృశ్యాదృశ్య మూర్తిర్మరకతకటకే క్లిష్టసూతా సుమేరోః
మూర్ధన్యావృత్తిలబ్ధ ద్రుతగతి రసతాద్బ్రధ్నవాహావళి ర్వః

పద్యం

స్ఫటిక ప్రదేశాల ప్రతిబింబములుచూచి
పరసైంధవములని భ్రాంతిచెంది
పద్మరాగాదుల ప్రభలు సంధ్యాకాల
రాగ రక్తిమలని భ్రాంతిచెంది
గరుడ పచ్చలుగల సరసమార్గములందు
స్వస్వరూపములని భ్రాంతిచెంది
సారథ్య మొనరించు సారథి గావించు
ధ్వని విశేషాలకు భ్రాంతిచెంది

మరల మరల వేగమ్ముగా పరువులెత్తు
సూర్యదేవుని సొగసుల వారువములు
వచ్చుచున్నవి చూడుమా! త్వరిత గతుల
రమణి! కొనితెమ్ము పసుపు కుంకుమలు పూలు!

## వ్యాఖ్య

అవిగో! సూర్యుని అశ్వాలు మేరుపర్వతంమీదకు వచ్చాయి. ఆ ప్రదేశం స్ఫటిక మణిమయ స్థగితం. ఆ మణులలో కనిపించే తమ ప్రతిబింబాలను చూచి వాటిని ఇతర అశ్వాలుగా భావించి సూర్యాశ్వాలు పరుగులు తీస్తున్నాయి.

ఆ అశ్వాలు మరికొంచెం ముందుకు వెళ్ళాయి. ఆ ప్రాంతం పద్మరాగ రాగరంజితం. ఆ కాంతిని చూచి అశ్వాలు సాయం సంధ్యారాగమని భ్రాంతిపడి మెల్లగా నడుస్తున్నాయి. మరికొంచెం ముందుకు వెళ్ళినప్పుడు గరుడపచ్చలున్న ప్రదేశం వచ్చింది. అక్కడ ఆ అశ్వాలు పయనిస్తున్నప్పుడు అవికూడా ఇదే రంగులో ఉండటంవల్ల సారథికి అశ్వాలు కనిపించలేదు. అనూరుడు కాస్త ఇబ్బంది పడ్డమాట నిజమే. అయినా కర్తవ్యాన్ని నియమబద్ధంగా పాటించే సూర్యాశ్వాలు అనూరుడు మరల మరల అదిలించేసరికి వేగంగా పయనించసాగాయి.

ఈవిధంగా సూర్యాశ్వాలు ఒక్కొక్క ప్రదేశంలో ఒక్కొక్క భ్రాంతిని పొందుతూ క్రాంత దర్శియైన కవికి ఆనందానుభూతిని కలిగించాయి. ఆ అశ్వాలు మీకు రక్ష కలిగించుగాక.

 

“ ప్రభాకరాయ నమః ”

## 47. శ్లోకం

హేలాలోలం వహంతీ విషధర దమనస్వాగ్ర జేనాపకృష్టో
స్వర్గాహిన్యా స్సుదూరం జనిత జవజయా న్యందనస్య స్వదేన
నిర్వ్యాజం తాయమానే హరితమణి నిచే స్ఫీత ఫేనాహితశ్రీ
రశ్రేయాం స్యశ్వ పంక్తి శ్శమయతు యమునేవా పరాతాపనీ వః

### పద్యం

కమనీయ సవిలాస గమనమ్ములై సాగు
సూర్య తురంగాలు సూర్యతనయ
వ్యాక నాగాగ్రజ వశవర్తులైసాగు
సూర్య తురంగాలు సూర్యతనయ
స్యందనాశ్వములు బాహ్యాని పయిపైసాగు
సూర్య తురంగాలు సూర్యతనయ
హరితమ్ములై ఫేనభరితమ్ములై సాగు
సూర్య తురంగాలు సూర్యతనయ

ద్వయము నేకమై వేషమ్ము సేయగోరి
లోకసేవకు లోక కాలుష్య మణచి
వచ్చుచున్నవి చూడుమా! వాహనములు
రమణి! కొనితెమ్ము పసుపు కుంకుమలు పూలు !

వ్యాఖ్య

అదిగో! సూర్యతురంగాలపరుస. అది సూర్యసుతయైన యమునా నదివలె వస్తున్నది. సూర్య తురంగాలకు సూర్యసుత తరంగాలకు ఎన్నో సామ్యాలు.

విషధర దమన అగ్రజుడు అంటే సర్పదమనుడైన గరుత్మంతుని అగ్రజుడు అనూరుడు. అనూరుడివల్ల సూర్యతురంగాలు నడపబడుతున్నాయి. సూర్యసుత యమున. విషధరదమనాగ్రజుడు కాళియసర్పదమనుడైన కృష్ణుడు. ఆయన అగ్రజుడైన బలరామునిచేత యమునానదీ తరంగాలు ప్రవహింపజేయబడ్డాయి. ఇచ్చట అశ్వ పంక్తికి యమునానదికి శ్లేషతో పోలిక చెప్పబడింది.

సూర్యతురంగాలు రథవేగాన్ని మించాయి. యమునా తరంగాలు గంగానదీ వేగం మించాయి. స్యందనం అంటే రథం అనీ సెలయేరు అని శ్లేష. సూర్యతురంగాలు యమునాతరంగాలు రెండూ హరితవర్ణాలపై తెల్లని నురుగును వ్యాపింపజేస్తున్నాయి. గమనశ్రమ వలన రెండూ నురుగులు కక్కుతున్నాయి.

అలా సూర్యతురంగాలు యమునాతరంగాలు రెండూ దర్శనమాత్రంచేత ప్రజల పాపాలను హరించేవే సుమా !

★ ★

"సవిత్రే నమః"

## 48. శ్లోకం

మూర్ధ్నోహ్మాంతీ సుమేరోద్భ్రమతి ప్రతిసతా నాకభాజాం నికాయే
పిష్ట్వ క్రీడావతీనాం ప్రతికరహరిణముఖం కిన్నరీణాం ముఖాని
సూతేఽనూయత్యవిష్టడగతి వహతాం కంధరాగ్రైర్విలబ్ధ
ర్వాహానాం వ్యస్యతాద్వస్సమ మనమహార్శ్లేషితం కల్మషాణి

పద్యం

సూర్యు హయాలకు సురసమూహంబెల్ల
మస్తకమ్ములువంచి నమస్కరింప
కిన్నరస్త్రీలు సిగ్గిలి గుహాముఖముల
జవనాశ్వపతుల వీక్షణముసేయ
తన వాటువమ్ముల దర్శనంబైనంత
నమ్మదమ్మున పోషితములౌలుర
ఆదిత్యుడేమైన అనుకొనునోయంచు
అరుణు డశ్వాలపై ఆగ్రహింప

మూడులోకాలవాసులు మోకరిల్ల
రవిమహారాజు సప్తాశ్వరథమునెక్కి
వచ్చుచున్నాడు అడుగో! సత్వరము చూడు
రమణి! గొనితెమ్ము పసుపు కుంకుమలు పూలు!

### వ్యాఖ్య

అవిగో! సూర్యాశ్వ ఘోటకాలు సుమేరుపర్వతంపైకి వచ్చాయి. ఎంత శోభాయమానంగా ఉన్నది ఆ ప్రాంతం.

అమరగణం అంతా నిలబడి అర్ఘ్యపాద్యాలతో పూజాపుష్పాలతో ఆదిత్యదేవుణ్ణి అర్చిస్తున్నారు. ఆ దృశ్యం అత్యద్భుతం. ఆదిత్యదేవుని మహిమ అమోఘం.

ఆ ప్రక్క మేరుపర్వత సుందర గుహా ముఖద్వారాలలో అశ్వవదనులైన కిన్నర స్త్రీలు సిగ్గుతో నిలబడి ఉన్నారు. తమ జాతి సామ్యంచేత వారిని చూడాలని కాబోలు పొడవాటి మెడలు సగం వంచి అటువైపే చూస్తున్నాయి. వాటి గమనవేగంకూడా మందగించింది. అశ్వహృదయం ఎరిగిన అనూరుడు సముచితంగా అదిలిస్తున్నాడు. ఆ గుర్రాల హేషితాలు కిన్నర స్త్రీలకు మధుర మనోహర భావ ప్రేరకాలు.

ఆ సూర్యాశ్వాలు ప్రజల పాపరాశిని దూరముగా తొలగించి వేయుగాక !

★ ★

"సప్తత్వా హరితో రథే వహంతి"

—తైత్తిరీయం

## 49. శ్లోకం

ధున్వంతో నీరదాళీర్నిజరుచి హరితాః పార్శ్వయోఃపక్షతులాత్ర
స్తాలూత్తానైఃఖలీనైః ఖచితముఖరుచశ్చ్యోతతా లోహితేన
ఉడ్డీనేన వ్రజంతో వియతి జవవశాదర్కవాహాఃక్రియాసుః
క్షేమం హేమాద్రిహృద్యద్రుమ శిఖర శిరశ్శ్రేణిశాఖాశుకా వః

పద్యం

మేఘపటాలతో మింటిపై ఎగసిన
పచ్చని వన్నెల పక్షులేవి?
శోణితారుణకాంతి శోభిల్లుచున్న ము
ఖమ్ములుగల విహంగమ్ములేవి?
విష్ణుపదమ్ముపై వేగమ్ముగా రివ్వు
రివ్వునపోయెడి గువ్వలేవి?
మేరు మనోజ్ఞ మహీరుహ శృంగాల
జిలిబిలి రవముల పలుకులేవి?

అవి మనోహర శుకము లన్నట్టులుండె
కాని అవి భాస్కర తురంగముల గములు
వచ్చుచున్నవి ఆకాశపథము బట్టి
రమణి! గొనితెమ్ము పసుపు కుంకుమలు పూలు!

వ్యాఖ్య

అది మేరుపర్వతప్రాంతం. పర్వతంపైన చెట్లునిండి ఆ పర్వతం ఒక మహావృక్షంగా కనిపిస్తున్నది. ఆకుపచ్చని సూర్యుని అశ్వాలు అక్కడకు చేరినప్పుడు ఆ వృక్షశాఖలపైన అందమైన చిలుకలు వాలినట్లు అనిపిస్తున్నది.

చిలుకల రంగు పచ్చన. సూర్యాశ్వాల రంగూ పచ్చన. రెక్కలలాగా కనిపించేవి పెద్దపెద్ద మేఘాలు. అశ్వాలకాంతి వాటిమీద పడి ఆ మేఘాలుకూడా చిలుకల రెక్కలవలె పచ్చగా కనిపిస్తున్నాయి. అనూరుడు అశ్వాల కళ్ళాలు లాగిపట్టటంచేత వాటి దవడలపై రక్తం కారి చిలుకల ముక్కులవలె ఎర్రగా ఉండి భ్రమ కలిగిస్తున్నాయి.

అచ్చంగా చిలుకలలాగానే సూర్యుని గుర్రాలు దౌడు తీస్తున్నాయి. ఆ గమనవేగంలో అశ్వాలు పర్వతవృక్షశాఖలపై బారులు తీర్చి కూర్చున్న చిలుకలా అన్నట్లు భ్రాంతి కలిగిస్తున్నాయి.

 

"అయుక్త సప్త శుంధ్యవః సూరోరథస్య నప్త్యః"

—తైత్తరీయం

# సూర్య సారథి

50 శ్లోకం

ప్రాతశ్శైలాగ్రరంగే రజని యవనికాపాయసంలక్ష్యలక్ష్మీ
ద్విక్షిప్తాపూర్వపుష్పాంజలిముడునికరం సూత్రధారాయమాణః
యామేష్వంకేష్వివాహ్నః కృతరుచిషు చతుర్ష్వేవలబ్ధప్రతిష్ఠా
మవ్యాత్ప్రస్తావయన్వో జగదటనవమహానాటికాం సూర్యసూతః

పద్యం

ప్రాగ్గిరీంద్ర ప్రభా రంగస్థలాన తూ
రాత్రి రాతిరితెర ఎత్తబడెను
మాంగళ్యతారకా మల్లికాంజలిబట్టి
శుభముపల్కె ననూరసూత్రధారి
నాలుగుయామాలు నాలుగంకాలయ్యె
దినభాగ దృశ్యాలు తీర్చబడెను
జరుగసాగె సుమనోహరముగా లోక ప
ర్యటనంబనెడి మహానాటకమ్ము

అళి శుకాదులు వివిధవాద్యములునూదె
సారథి రయాన పలికె ప్రస్తావనమ్ము
భాస్కరరథమ్ము రంగమ్ముపైకి వచ్చె
తమ్ముడా! తెమ్ము అర్ఘ్య పాద్యములు పూలు

వ్యాఖ్యాత

అదిగో! ప్రాతశ్శైలాగ్రభాగాన రంగస్థలం సిద్ధమయింది. రజని యనే యవనిక తొలగించబడింది.

అరుణుడు సూత్రధారియై రంగప్రవేశం చేస్తున్నాడు. మంగళవాద్యాలు మ్రోగుతున్నాయి. ఆ మహాపురుషుడు కరకమలాలతో నక్షత్ర మల్లికాపుష్పాలు వెదజల్లి నాటకానికి ప్రస్తావన చేస్తున్నాడు.

అది రవిరాజు జగత్పర్యటన నాటకం. అందులో అంకాలు నాలుగు. పగలు నాలుగుజాములు నాలుగంకాలు. అళికులాదులు మంగళవాద్యాలు ఊదుతున్నాయి. ఆదిత్యుడు రాబోతున్నాడు. సూర్యరథసారథి అనూరుడు ముందుగావచ్చి ప్రస్తావన జరుపుతున్నాడు. ఆ అనూరుడు జగన్నాటక ప్రేక్షకులైన మీకు శుభము కలిగించుగాక.

★ ★

"శంభవే నమః"

## 51. శ్లోకం

ఆక్రాంత్యా వాహ్యమానం పశుమివ హరిణావాహకోఽగ్ర్యో హరీణా
భ్రామ్యంతం పక్షపాతాజ్జగతి సమరుచిస్సర్వకర్మైకసాక్షీ
శత్రుంనేత్రశ్రుతీనామవజయతి వయోజ్యేష్ఠభావే సమేఽపి
స్థేమ్నాం ధామ్నాం నిధిర్యస్సభవదఘనుదే నూతనస్స్యాదనూరుః

### పద్యం

హరిసేవలో నిత్య మిరువురు నొక్కటే
అతనికంటె రవంత ఇతడె మిన్న
ఖర పక్షపాతాన నిరువురు నొక్కటే
అతనికంటె రవంత ఇతడె మిన్న
చిరవయోజ్యేష్ఠత నిరువురు నొక్కటే
అతనికంటె రవంత ఇతడె మిన్న
స్థిరకాంతిబలముల నిరువురు నొక్కటే
అతనికంటె రవంత ఇతడె మిన్న

గరుడు డతడు - గరుడాగ్రజు డితండు
కర్మసాక్షివద్ద కర్మయోగి
తేజరిల్లు దివ్యదేహుం డనూరుండు
అనుజ! తెమ్ము పూలు అర్ఘ్యములును

## వ్యాఖ్య

అదుగో! సూర్యదేవుని సారథి అనూరుడు. ఎఱ్ఱని పట్టు బట్టలు కట్టుకొని మహాతేజస్సుతో వస్తున్నాడు. రథం అంతా సింధూర కాంతులే. ఆయన అచ్చంగా గరుత్మంతునివలెనే ఉన్నాడు. అవును. ఇద్దరూ అన్నదమ్ములేగదా.

కాంతులు ప్రసరింపచేయటంలో ఇరువురు సమానులే. వయోదృష్టితో చూస్తే అనూరుడు పెద్దవాడు. వయః అంటే పక్షి అని అర్థం. పక్షుల నాయకుడుగా గరుత్మంతుడు పెద్దవాడు.

మరి గరుత్మంతునికంటె అనూరుడు ఏ విధంగా మిన్న అంటే హరిచేత వాహనంగా చేసుకొనబడినవాడు గరుత్మంతుడు. హరులను తానే వాహనాలుగా చేసుకొన్నవాడు అనూరుడు.

గరుత్మంతుడు పక్షపాతంతో అంటే ఱెక్కలల్లార్చటంతో సంచరించేవాడు అనూరుడు పక్షపాతం లేకుండగా సమానమైన కాంతితో ప్రవర్తించేవాడు, సర్వకర్మల సాక్షిగా సంచరించేవాడు.

ఈ విధంగా తమ్మునికన్నా అన్నయే మిన్న అనిపిస్తున్నది.

★ ★

"వీరాయ నమః"

## 42. శ్లోకం

వత్త్వాత్త్వెద్వారభూమౌ ప్రియుతి వినయతో వేషితస్సిద్ధసాధ్యైః
సాన్నాథ్యం సారథిర్వస్స దశశతరుచేస్సాతిరేకం కరోతు
ఆపీయ ప్రాతరేవ ప్రతతహిమపయస్స్యందినీరంధ్రధానూ
ర్వ్యః కాష్ఠాదీపనోఽగ్రే జడితఇవ భృశం సేవతే ప్రష్ఠతోఽర్యః

### పద్యం

సరతమ్ము వెనువెంట కురియుటన్ కాబోలు !
వడిగొని గడగడ వణికినాడు
రాత్రి మెల్కొనుట ప్రాగుటన్ కాబోలు !
అంగశైథిల్యమ్ము నందినాడు
సర్వకాష్ఠా దీపనముచేసి కాబోలు !
చలి కాచుకొనుచు రాసాగినాడు
మునుకొని పరువెత్తుకొనివచ్చి కాబోలు !
గ్రహపతిసేవకు గడగినాడు

సూర్యసారథి వచ్చుట చూచి వేగ
దూరమందుండి సిద్ధసాధ్యులు వినమ్ర
శీర్షులై మ్రొక్కులొసగి పూజించినారు
తమ్ముడా! తెమ్ము అర్ఘ్య పాద్యములు పూలు

వ్యాఖ్య

అదుగో! సూర్యసారథి అనూరుడు వస్తున్నాడు. రాత్రి తెల్లవార్లూ మంచు కురుస్తుండే ఆ చంద్రకిరణాలను అదేపనిగా త్రాగటంవల్ల చల్లదనం కలిగినట్లుంది. గజగజా వణికిపోతున్నాడు.

అందుకే కాబోలు ఆయన ముందుగా కాష్ఠాదీపనం చేస్తున్నాడు. అప్పుడు దిక్కులు వెలిగి కొంచెం వెచ్చపడుతున్నాయి. ఆయన చలికాచుకొంటున్నాడు. కాష్ఠా అంటే దిక్కులు అని, కట్టెలు అని రెండర్థాలు.

మరొక ప్రక్క భక్తితో సూర్యుని సేవిస్తూ హయాలు త్రోలుతున్నాడు. అదుగో! అల్లంత దూరంనుంచే సిద్ధులు సాధ్యులు ఆదిత్యునికి అంజలిఘటిస్తూ వినయంతో అనూరుణ్ణి తిలకిస్తున్నారు.

సూర్యరథసారథియైన అనూరుడు మీకు రక్ష కలిగించుగాక!

★ ★

"పింగళాయ నమః"

## 53. శ్లోకం

ముంచన్ రశ్మీందినాదౌ, దినగమసమయే సంహరంశ్చ స్వతంత్ర
స్తోత్ర ప్రఖ్యాతవీర్యో వియతిహరిపదాక్రాంతిబద్ధాభియోగః
కాలోత్కర్షాల్లఘుత్వం ప్రసభమధిపతౌ యోజయన్యో ద్విజానాం
సేవాప్రీతేనపూష్ణా స్వసమఇవ కృతస్త్రాయతాం సోఒరుణో వః

పద్యం

ఉదయకాలమ్మున ఉన్నతోచితరీతి
వదలుదు రిరువురు పగ్గములను
సాయంసమారంభ సమయాన నిరువురు
ఉపసంహరింతురు ఉరకలెల్ల
స్తోత్ర తోత్రమ్ములు మైత్రితో గ్రహియించి
ఇరువురు నొసగుదు రీప్సితములు
హరిపదమ్ములుపట్టి ఆక్రమించుటలోన
ఇరువురు మగ్నులౌదురు సతమ్ము

సత్రమోచిత కాలాతిశయముచేత
తమ ద్విజాధిపతుల గెల్చి ధన్యులయిరి
అరుణ సారథు లిరువు - రనూరు డడుగొ!
తమ్ముడా! తెమ్ము అర్ఘ్యపాద్యములు పూలు

## వ్యాఖ్య

అదుగో! ఆ తూర్పుకొండపై అరుణారుణ వరుణ కిరణాలతో అరుదెంచేదెవరు? ఆదిత్యుడా! అనూరుడా? తనను సేవించటం వల్ల ప్రీతిపొంది సూర్యుడు అనూరుణ్ణి తనంతటి వాడిని చేశాడు. వారిద్దరికీ సామ్యం చక్కగా కనిపిస్తున్నది.

రశ్ములకు కిరణాలు, పగ్గాలు అని అర్థాలు. సూర్యుడు కిరణప్రసారం చేస్తాడు. అనూరుడు గుఱ్ఱాల పగ్గాలు సారించి స్వారి చేయిస్తాడు. సాయంకాలం ఇద్దరూ రశ్ములను ఉపసంహరించుకొంటారు.

భగవానుడు సూర్యుడు స్తోత్రంతో ప్రీతిపొంది ఆయురారోగ్యాలు ప్రసాదిస్తాడు. అనూరుడు తోత్రం అంటే ములుకోల ధరించి అశ్వాలను అదలిస్తాడు.

హరిపదం అంటే ఆకాశం అనీ అశ్వపాదం అని అర్థాలు. ఆదిత్యుడు ఆకాశంపై గమిస్తాడు. అనూరుడు అశ్వపాదాలను నడపటంలో నిమగ్నుడౌతాడు. ద్విజాధిపతికి చంద్రుడు గరుడుడు అని అర్థాలు. సూర్యుడు చంద్రుణ్ణి మించుతాడు. అనూరుడు గరుడుణ్ణి మించుతాడు. అటువంటి సూర్యసమానుడైన అనూరుడు ఆయురారోగ్యాలు ప్రసాదించుగాక!

★ ★

"సహస్రాంశవే నమః"

## 54. శ్లోకం

శాతశ్శ్యామాలతాయాః పరశురివ తమోఽరణ్యవహ్నేరివార్చిః
ప్రాచ్యేవాగ్రే గ్రహీతుం గ్రహకుముదవనం ప్రాగుదస్తాగ్రహస్తః
సత్వం భిందంద్యుభూమ్యోరవధిరివ విధాతేవ విశ్వప్రబోధం
వాహానాం వో వినేతా వ్యపనయతు విపన్నామ ధామాధిపస్య

పద్యం

అద్దదిద్దమ్ముగా అల్లిన శర్వరీ
రణవల్లరులకు పరశ్వధమ్ము
అంధకార భయంకరారణ్య భూములన్
దహియించుటకు మహాదావవహ్ని
ప్రాగంగనకు వైరి గ్రహములన్ బెదరింప
గట్టిగా చాచిన కరతలమ్ము
అవనికి అభ్రమ్ము ద్వైకృత భేదింప
అనువుగా నుంచిన అవధిరేఖ

చిరము విశ్వప్రబోధమ్ము సేయుటందు
బ్రహ్మదేవుడు - సూర్యాశ్వపాలకుండు
శ్రీః సూరప్రభుండు విచ్చేసినాడు
తమ్ముడా! తెమ్ము అర్ఘ్య పాద్యములు పూలు

వార్తిక

అదుగో! అనూరుడు కాంతికిరణాలతో కనిపిస్తున్నాడు. అతడు అతిలోకవీరుడు. అంతేకాదు అసహాయశూరుడు. ఆ అనూరుడు అడ్డంగా అల్లుకుపోయే రాత్రి అనే విషవృక్షాలకు గండ్రగొడ్డలి వంటివాడు.

ఆయన అంధకారం అనే అరణ్యానికి దావాగ్నివంటివాడు. అతడు అనూరుడే కాని కార్యరంగంలో అనుపమానధీరుడు.

పద్మానికి బాధాకరములైన కలువలనే గ్రహాలను నేర్పుగా తొలగించటంలో సమర్థుడు. ఆయన భూమ్యాకాశాలు పెనవేసుకొని పోతుంటే బాటసారులకు తెలియచెప్పటానికి అవధి గీస్తున్నాడు.

ఆయన విశ్వానికి జ్ఞానప్రబోధం చేయటంలో బ్రహ్మదేవుడంతటివాడు. ఆదిత్య ఐశ్వర్యసంచాలకుడైన అనూరుడు మీ అందరి ఆపదలను తొలగించుగాక!

★ ★

"అగ్నిహోత్రాయ నమః"

### 65. శ్లోకం

పౌరస్త్యస్తోయదర్తోః పవనఇవ పతన్పావకస్యేవ ధూమో
విశ్వస్యేవాదిసర్గః ప్రణవఇవ పరం పావనో వేదరాశేః
సంధ్యానృత్యోత్సవేచ్ఛోరివ మదనరిపోర్నాందినాందీనినాద
సౌరస్యాగ్రే సుఖం వో వితరతు వినతానందనఃస్యందనస్య

### పద్యం

వర్షమ్మునకుముందు హర్షరోమాంచమ్ము
గా వచ్చు చల్లని గాలివోలె
అగ్నిదేవుని మంగళావిర్భవము ముందు
పైకమ్ము వచ్చు ధూపమ్మువోలె
విశ్వమ్ము క్రమముగా వెలుగొందుటకు ముందు
చిగురించు ఆదిమ సృష్టివోలె
వేదరాశికిముందు వినుతింపబడిసాగు
వరణీయమౌ ప్రణవమ్మువోలె

శివుడుగావించు సందె తాండవముముందు
వాద్య మాంగల్య నాందీ రవమ్మువోలె
సూర్యునకుముందు గరుడాగ్రజుండు వచ్చె
తమ్ముడా! తెమ్ము అర్ఘ్య పాద్యములు పూలు !

వ్యాఖ్య

అవిగో! అరుణరేఖలు కనిపిస్తున్నాయి. అనూరుడు దర్శన మిస్తున్నాడు.

సూర్యసారథి అనూరుడు రావటం వర్షఋతువుకు ముందు వచ్చే తూర్పుగాలివలె ఉన్నది. అరుణసారథి అగ్ని ఆవిర్భవించ టానికి ముందువచ్చే ధూమంవలె వస్తున్నాడు.

ప్రపంచానికి ముందు జరిగిన ఆదిమసృష్టివలె ఉన్నాడు ఆ అనూరుడు. మరింకా భావనచేస్తే అనూరుడు వేదరాశికి ప్రథమ స్థానంలో నిలిచే పవిత్ర ప్రణవనాదంవలె ప్రకాశిస్తున్నాడు.

నిత్య సంధ్యాతాండవంలో మహా నటరాజు ముందు నడిచే నందీశ్వరుడూ, నాందియూ అన్నట్లుగా ఉన్నాడు. ఇలా ఊహించిన కొద్దీ మహోన్నత భావాలకు పాదు అవుతున్నాడు అరుణసారథి.

వినతాదేవి ముద్దుల పెద్దబిడ్డ అరుణుడు మీకు సుఖాలను ప్రసాదించుగాక.

 

"వర్షతే నమః"

## 56. శ్లోకం

పర్యాప్తం తప్తచామీకరకటకతటే శ్లిష్టశీతేతరాంశో
రాసీదత్స్యందనాశ్వానుకృతిమరకతే పద్మరాగాయమాణః
యస్సోత్కర్షాం విభూషాం కురుత ఇవ కులక్ష్మాభృదీశస్య మేరో
రేనాంస్యహ్నాయ సూరంగమయతు సగురుః కాద్రవేయద్విషో వః

పద్యం

సూర్యదేవు సహస్ర సురుచిర దీప్తితో
తప్తమౌ తళతళ తళుకులీను
హేమశృంగములభాయ గిరిదపచ్చంబగావి
శ్రేష్ఠమ్ములై ప్రకాశించుచుండ
స్ఫటికసుందరాసనశ్రీ వర్ణకాంతులు
పద్మరాగమ్ములై పరిఢవింప
రమణీయ మేరుపర్వత చిత్రవర్ణాలు
నవ మంగళాభరణాలుగాగ

అరుణదేహమ్మువాడు అనూరువరుడు
సూర్యసారథి గరుడాగ్రజుండు అడుగో
వారువములు తోలుకొని వే వచ్చినాడు
తమ్ముడా! తెమ్ము అర్ఘ్య పాద్యములు పూలు !

వ్యాఖ్య

అదుగో! అరుణసారథి. స్యందనాన్ని సారిస్తున్నాడు. అరుణుడు ఎంత కాంతిమంతంగా ఉన్నాడు.

ఆ సూర్యరథం మేరుపర్వతం దగ్గరకు వచ్చింది. సూర్యుని కాంతిచ్ఛటలకు ఆ ప్రాంతం ధగధగలాడుతున్నది. ఆ అశ్వాల ఆకుపచ్చకాంతులు అచట ప్రతిబింబించి గరుడపచ్చలు పొదిగినట్లుగా ఉన్నది.

ఆ కాంతులమధ్య అరుణరాగరంజితుడైన అనూరుడు పద్మరాగమణిలాగ ప్రకాశిస్తూ, మేరువుకే ఆభరణంలాగా తేజరిల్లుతున్నాడు. పరమాద్భుతమైన సౌందర్యశోభతో ఆ కాంతిప్రవాహాల మధ్యలో అనూరుడు అనుపమానంగా శోభిస్తున్నాడు.

గరుడాగ్రజుడైన అనూరుడు మీ పాపసమూహాన్ని పటాపంచలు చేయుగాక!

★ ★

"ప్రభవే నమః"

## 57. శ్లోకం

నీత్వాశ్వాంస్తత్పరశ్మ్యై ఇవ నియమవశం వేత్రకల్పప్రతోద
స్తూర్ణం ధ్వాంతస్య రాశావితరజన ఇవోత్సారితే దూరభాజి
పూర్వం ప్రష్ఠో రథస్య క్షితిభృదధిపతీందర్శయంస్త్రాయతాద్వః
స్త్రైలోక్యాస్థానదానోద్యత దివసపతేః ప్రాక్ప్రతీహారపాలః

### పద్యం

నక్షత్రకక్ష్యలపైన సప్తాశ్వములు బూన్చి
నవపద్ధతుల తేరునడుపువాడు
తిమిరమహాఘోర సముదాయములనెల్ల
దూరఖండములకు త్రోలువాడు
తేరుపై నిలబడి మేరుశైలప్రాంత
భూపవర్గమ్మును చూపువాడు
ముల్లోకవాసులు పూజింప రవిరాజు
కగ్రప్రతీహారుడైనవాడు

మునుల స్తవములు మునుముందుగొనెడివాడు
అరుణకాంతులు దిక్కుల బరపువాడు
సూర్యసారథి గరుడాగ్రజుండు వచ్చె
తమ్ముడా! లెమ్ము అర్ఘ్య పాద్యములు పూలు !

వ్యాఖ్య

అదుగో ! అనూరుడు ! సూర్యసారథి ! అరుణకాంతులతో అరుదెంచినాడు. ప్రతీహారే ఇంత తీవిగా ఉన్నాడే ప్రభువు ఇంకెంత తీవిగా ఉంటాడో కదా !

ఏడు గుర్రాలు ఏడు కక్ష్యలవలె విరాజిల్లుతున్నాయి. అవి అరుణుని స్వాధీనంలో అణకువతో ప్రవర్తిస్తున్నాయి. అనూరుడు వేత్రాన్ని లాంచనప్రాయంగా ధరించాడు. అశ్వహృదయం ఎరిగిన వాడుగదా !

సార్వభౌముడు విహారానికి వెళుతుంటే ప్రతీహారి ఇతరులను దూరంగా తరుముతున్నట్లు సూర్యసారథి అనూరుడు చీకటి మూకలను దూరంగా పారద్రోలుతున్నాడు. అనూరుడు మనోహరంగా స్యందనంముందు కూర్చొని సూర్యసార్వభౌముడికి మేరు పర్వత ప్రభువులను చూపి వారిని పరిచయం చేస్తున్నాడు లీలా మాత్రంగా.

త్రిలోక రాజ్యసింహాసనంపై ఆసీనుడైన సూర్యసార్వభౌముడు సాక్షాత్కరిస్తున్నాడు. ప్రధాన ప్రతీహారుడుగా ముందు కనిపించే అనూరుడు శుభముల నొసగుగాక.

 

“విశ్వభావనాయ నమః”

## 58. శ్లోకం

పాశానాశాంతపాలాదరుణ వరుణతో మాగ్రహీః ప్రగ్రహార్థం
త్వష్టాం ద్రష్టస్య చక్రే జహిహి నహి రథో యాతి మే నైకచక్రః
వోఢుం యుగ్యం కిముచ్చైశ్శ్రవసమభిలషస్యష్టమం వ్యర్థశక్తో
త్యక్త్వాన్యాశ్వేషేకవిశ్వోపకృతిరితి రవిశ్శాస్తి యంసోఽవతాద్వః

### పద్యం

అరుణసారథీ! నీవు వరుణాధిపతినుండి
పాశాలు గొనకుము పగ్గములకు
గరుడాగ్రజా! నీవు కమలాక్షు కడకేగి
అడుగకు చక్రమ్ము అరదమునకు
కాశ్యపీ! నీవు సంక్రందనుని అడిగి
చక్కగైకొనకు ఉచ్చైశ్రవమ్ము
పిచ్చికుంటూ! నీవు పిచ్చిగా భయపడి
ఎవరి సహాయ మర్థించబోకు

వసుధ నుపకారమొనరించు వ్రతముగొన్న
త్యాగశీలికి నెపుడు భయమ్ము వలదు
అంచు రవి పల్కె అరుదెంచె అరుణమూర్తి
తమ్ముడా! తెమ్ము అర్ఘ్య పాద్యములు పూలు !

వ్యాఖ్య

అదుగో! ఆదిత్య మహారాజు విజయం చేస్తున్నాడు. వస్తూనే అనూరునికి హెచ్చరిస్తున్నాడు.

అరుణా! నీవు ప్రయాణం విషయంలో ఏమాత్రం భయపడబోకు. భయపడి సందేహించి ఎవరినీ ఏమీ సహాయం కోరకు. అసహాయశూరుడైన సూర్యుడు ఇతరుల సహాయం కోరటం అంటే తలవంపులు సుమా!

పగ్గాలు చాలవేమో అని పాశాలకు పశ్చిమాధిపతి దగ్గరకు పరుగులు పెట్టబోకు. మనదగ్గరున్నవి చాలు. అవి చాలా శక్తిమంతాలు. మన రథానికి ఒకేచక్రంగదా అని కంగారుపడి విష్ణుచక్రం కోసం విష్ణువు కడకు వెళ్ళనవసరంలేదు. మన రథం ఏకచక్రంపై మహావేగంగా పోతుంది. మన గుర్రాలు ఏడే ఉన్నాయి. ఇతలు కుదరటంలేదని ఎనిమిదవ గుర్రంకోసం ఇంద్రుడికడకు ఉచ్చైశ్రవంకోరి వెళ్ళకు. ఈ సప్తాశ్వాలు రథాన్ని నేర్పుగా వేగంగా లాగుతాయి. ఆపుర్దా పడు.

ఏ సహాయంకోసమూ ఎవరినీ అర్థింపకు. అచంచలమైన చక్రాని విశ్వాసంతో ఉంచు అంటూ ఇతరుల సహాయం అపేక్షించకుండానే విశ్వప్రకృతి కలిగించే సూర్యభగవానుడు అనూరునికి ధైర్యం కలిగిస్తున్నాడు.

ఆవిధంగా భగవానుని దగ్గర అభయం పొందుతున్న అనూరుడు మిమ్ము రక్షించుగాక!

★ ★

"ఆతపినే నమః"

59. శ్లోకం

వజ్రింజ్ఞాతం విభాసీశబలిమబ్జవనంభాసి, నో భాసి పశ్చా-
జ్జాతం నత్వాశ్వపార్శ్వం సయమ యమను మహిషం రాక్షసాక్షి
సప్తీన్ సించ ప్రచేతః పవన భజ జవం విత్తపా వేదిత స్త్వం
వందే శర్వేతి జల్పన్ ప్రతిదిశమధిపాన్ పాతు పూష్ణోఽగ్రజః

పద్యం

''సురపతీ! నీ కనుల్ సరసిజాత్మె వెల్గె
సప్తార్చి! నీ ప్రకాశము తగ్గె
యమ! మ్రొక్కి మహిషమ్ము హయము ప్రక్కకు
సోకుమూతా! రవి చూచె మిమ్ము
అప్పతీ! తడుపుము అశ్వమ్ములను నీట
అనిల! వేగమ్మును అందుకొనుము
విత్తపా! రవికి నివేదింపబడినావు
స్మరహరా! ఇదె నమస్కారశతము''

అష్టదిక్పాలకులగూర్చి అతుల పలికి
ఉచితరీతి ప్రవర్తించి ఉష్ణరశ్మి
సారథి అనూరు దీవెంచె అదుగో! చూడు
తమ్ముడా! తెమ్ము అర్ఘ్య పాద్యములు పూలు !

వ్యాఖ్య

అదుగో! అరుణసారథి అష్టదిక్పాలకుల్ని తగినట్లు పలుకరిస్తున్నాడు—

"ఇంద్రా! సహస్రనేత్రా! నీ వేయికన్నుల కమలాలు వికసించి ప్రకాశిస్తున్నాయిగదా! అగ్నిదేవా! సూర్యకాంతులముందు నీ కాంతులు సన్నగిల్లినట్లున్నాయి పాపం! యమధర్మరాజా! మీ తండ్రి వస్తున్నారు. నమస్కరించి నీ మహిష వాహనాన్ని ప్రక్కకు తొలగించు. నైరుతీ! సూర్యభగవానుని దృష్టి మీపైబడింది. శుభం కలుగుతుందిలే.

వరుణా! గుర్రాలు అలసటజెంది దప్పికగొని ఉన్నాయి. కాసిని నీళ్ళు పట్టు. పవనా! నీవు వేగాన్ని అందుకో. కుబేరా! సూర్యస్వామికి నీవు ఈశ్వరా! నివేదింపబడ్డావు. నీకు నమస్కరిస్తున్నాను" అని అష్ట దిక్పాలకులను గురించి పలుకుతున్న సూర్యసారథియైన అరుణుడు మిమ్ము రక్షించుగాక !

★ ★

"దేవాసురగణలోకపాలాయ నమః"

## 52. శ్లోకం

నో మూర్ఛాచ్ఛిన్నవాంఛశ్శ్రమవివశ వపుర్నైవ నాప్యాస్తశోషి
పాంథః పథ్యేతరాణి క్షపయతు భవతాం భాస్వతోఽగ్రేసరస్సః
యస్సంశ్రిత్య త్రిలోకీమటతి పటుతరైస్తప్యమానో మయూఖైః
ఆరాదారామరేఖామివ హరితమణిశ్యామలా మశ్వపంక్తిమ్

## పద్యం

గారుత్మతశ్యామ వారువసంఘమ్ము
వనమునువలె వీడకున్న సతము
జ్వలన మయూఖాల సంతప్యమానుడై
చూడ స్మృతినొకింత కోలుపోక
నిరత ప్రయాణాల వెరపి ఎరుంగక
ఉస్సురంచున మేను డస్సిపోక
వడగాడ్పు వీచగా బడలిక అధికమై
మండుటెండలకు నోరెండనీక

భాస్కరునిముందు పీఠమ్ముపై వసించి
అరదము గమించ సప్తహాయాలు తోలు
అరుణసారథి వచ్చె నల్లడుగో! చూడు
తమ్ముడా! తెమ్ము అర్ఘ్య పాద్యములు పూలు!

వ్యాఖ్య

అదుగో! సూర్యరథంపై అరుణరాగరంజితుడై అనూరుడు దర్శనమిస్తున్నాడు.

సూర్యభగవానుని వాడి వేడి కిరణాలవల్ల అనూరుడు బాగా సంతప్యమానుడయినట్లున్నాడు. అయినా గారుత్మత మణులవలె శ్యామలమైన వర్ణంతో ఉన్న అశ్వసమూహాన్ని ఆతడు వనసమూహాన్ని చేరి ఉన్నట్లు సన్నిహితంగా చేరి ఉన్నాడుగదా. అందువల్ల అంత ఎండలోనూ అనూరుడు మూర్ఛపోలేదు. నిరంతరము ప్రయాణంచేస్తూ ఉన్నాకూడా డస్సిపోలేదు. వడగాడ్పులు వీస్తున్నా కూడా ఆతనికి నోరు ఎండిపోలేదు.

సూర్యునికి ముందు కూర్చొని ముల్లోకాలను ప్రతిరోజూ పర్యటించే ఆ బాటసారి అరుణుడు మీకు అహితాలు పోగొట్టి హితం చేకూర్చుగాక !

★ ★

"తామ్రో అరుణః"

## 61. శ్లోకం

సీదంతో ఒంతర్నిమజ్జజ్జడఖురముసలాస్సైకతే నాకనద్యాః
స్కందంతః కందరాళీః కనకశిఖరిణో మేఖలాసు స్ఖలంతః
దూరం దూరాస్థలోర్ధ్వా మరకతదృషది స్థాణవీయన్నయాతాః
పూష్ణో ఒశ్వాః పూరయన్త్వస్తదపటు జవనైర్వాంఛితంతేనాగ్రగో వః

పద్యం

గగనగంగానదీ తత్రమ సైకతరాశి
పెగలక గిట్టలు దిగబడంగ
మిట్టపల్లములైన మేరుపర్వతభూమి
విషమ ప్రదేశాల వెడలలేక
మరకతద్యుతిలోన మధుశాద్వలభ్రాంతి
వడివడి ముందుకు అడుగుపడక
దాపు శీతల వాత వారివాహ చ్ఛాయ
ప్రక్కదారులలోకి పట్టిలాగ

సక్రమంబుగ నదలించి సైంధవముల
స్యందనము తోలుకొనివచ్చె అరుణమూర్తి
సూర్యసారథి గరుడాగ్రజుండు అడుగో!
తమ్ముడా! తెమ్ము అర్ఘ్యపాద్యములు పూలు!

వ్యాఖ్య

అదుగో! సూర్యసారథి సూర్యాశ్వాలను అదిలిస్తూ రథం తోలుకువస్తున్నాడు.

అది ఆకాశగంగాప్రాంతం. అశ్వాలు ఆ సైకత తీరాలలో గిట్టలు కూరుకొనిపోగా వేగంగా పరువెత్తలేకపోతున్నాయి. అది మేరుపర్వతప్రాంతం. ఆ ప్రదేశమంతా ఎగుడుదిగుడుగా విషమంగా ఉన్నది. అక్కడ ఆ సూర్యరథాశ్వాల గమనం సక్రమంగా సాగటం లేదు. ఎంత జాగ్రత్తగా నడుస్తున్నా గతిభంగం అవుతున్నది.

అవి మరకత మణిమయ ప్రదేశాలు. ఆ ఛాయ చూస్తుంటే పచ్చని శాద్వలం చక్కగా వ్యాపించినట్లుంది. అది పచ్చగడ్డి అని మేయటానికి మెడలుచాచి ఆ అశ్వాలు ఆగి ఆగి నడుస్తున్నాయి.

ఇలా బాధలలో భ్రమలలోపడిన గుఱ్ఱాలను తన హుంకారంతో అదిలించి వేళ అతిక్రమించకుండా సారథి సారథ్యం చేస్తున్నాడు. ఆ అరుణుడు అందరి కష్టాలు తొలగించుగాక!

 

"దినాధిపతయే నమః"

# సూర్య రథము

## 62. శ్లోకం

పీనోరః ప్రేరితాభ్రైశ్చరమఖురపుటాగ్రస్థితైః ప్రాతరద్రా
వాదీర్ఘాంగై రుదస్తో హరిభిరపగతాసంగ నిశ్శబ్దచక్రః
ఉత్తానానూరుమూర్ధావనతి హతభవద్విప్రతీప ప్రణామః
ప్రాహ్ణే శ్రేయోవిధత్తాం సవితురవతరన్వ్యోమవీథీంరథో వః

పద్యం

వారువాలై వచ్చు వారివాహములను
మొదల రాపిడిచేత ఎగురగొట్టి
వెనుకగిట్టలు తూర్పురసకాద్రిపై పూన్చి
పరుగువేగాన ఉప్పరమునెగసి
అత్యంత శుభలక్షణాయు తాజానేయ
వ్రాతమ్ము భాస్కర రథములాగ
ఘాతధాత్రిని ఇంతముట్టక ధ్వనిలేక
ఏకచక్రరథమ్ము నింపునొలుక

ప్రతిభచూపు అనూర సారథ్యమందు
చిత్రభానుని పరమపవిత్ర రమ్య
రత్నదీప్తుల కాంచన రథము వచ్చె
రత్న నీరాజనం బీయరా! కుమార!

## హ్యాశ్వ

ఆదిగో! ఉదయమవుతున్నది. అభ్యుదయమవుతున్నది. సూర్యరథం తూర్పుకొండశిఖరాల పైనుంచి వస్తున్నది.

గుర్రాలు తమ గమనవేగంవల్ల విపులవక్షాలతో జీమూత సమూహాలను చెదరగొడుతున్నాయి. ఆ అశ్వాలు పరుపులుతీస్తూ ఉదయాద్రిపైన వెనుక కాళ్ళ గిట్టలుమాత్రం ఒక్కసారి ఆనించినట్లు తోస్తున్నది. ఆ గుర్రాల శరీరాలు సుదీర్ఘాలు. సువిశాలాలు, సుందర **ఆయతాలు.**

అలాంటి సర్వశ్రేష్ఠ గంధర్వజాతి హయాలు కనుకనే అవి నిత్యం సూర్యరథాన్ని లాగగలుగుతున్నాయి.

ఆ రథం ఏకచక్ర శోభితం. ఆ స్యందనానికి ఎదురులేదు. ఆ రథం చక్రాలను అసలు రోపనే ఉండవు. అలాంటి అత్యద్భుత రథాన్ని అతివేగంగా చాకచక్యంగా సారథి నడుపుతున్నాడు. ఆ వేగగమనంలో అనూరుని నమస్కారమును అందుకొంటున్న ఆ సూర్యరథం మీకు సకల శుభాలను అనుగ్రహించుగాక!

★ ★

"రథే యుక్త్వా౽ధితిష్ఠతి"

—తైత్తరీయం

## 67. శ్లోకం

ధ్వాంతౌఘధ్వంసదీక్షావిధి గురుమహతా ప్రాప్తసహస్రం కరాణా
మర్యమ్ణో యో గరీయఃపదమతులముపానీయతాధ్యాసనేన
స క్రాంతానాం నితాంతం భరమివ మరుతాముక్షమాణాం వినోధుం
స్కంధాత్స్కంధం ప్రజన్యో వృజిన విహతయే శాశ్వతస్స్యందనోఽస్తు

### పద్యం

కర్కశ గాఢాంధకార సందోహమ్ము
    కూకటి వ్రేళ్ళతో కూల్చివేయ
నిత్య నిరంతర సత్యదీక్షను బూని
    వేల మయూఖాలు వెన ధరించి
ప్రాచీన సువిశాల పర్వతారణ్యాలు
    వీక్షణమ్ములచే పరీక్షచేసి
మారుత స్కంధాల మారుచు జనుచున్న
    తేజోవిరాజిత వాజులున్న

అరుణ సారథి వచ్చుచున్నట్లు తోచె
రథపతాక దీధితులు దర్శనమొసంగె
స్యందనం బల్లదే వచ్చె అదిగొ చూడు
రత్న నీరాజనం బీయరా! కుమార!

## వాశిష్ఠి

అదిగో! వెలుగుపట్టాలపై పరుగెత్తుకు వస్తున్న కాంతిరథం. అది సూర్యరథం. మార్తాండుని మహారథం. మానవజాతి మనోరథం వస్తున్నది వస్తున్నది!

అది అజ్ఞాన అంధకారబంధురాన్ని హతమార్చే రవిరథం. ఆదిత్య సత్యమూర్తి అధిరోహించి చైత్రయాత్ర సలిపే అందాల స్యందనం. అది మహాభారం. దానిని లాగటంకూడా చాలాకష్టం. దానికి చక్రం ఒక్కటే. సమర్థవంతాలై హరిదశ్వాలు సయితం లాగలేక అలసిపోతుంటాయి.

అవి జాతి జవనాశ్వాలు. అయినా నిత్య పరిశ్రమవల్ల చాక చక్యంతో రథాన్ని లాగుతున్నాయి. అందుకని ఆ అరదం మారుత స్కంధాలపై మారుతూ మారుతూ నడుస్తుంటాయి. మహావేగంగా హయాలు పయనిస్తున్నాయి.

ఆ రథ కాంతులు ప్రజల పాపతమస్సులను పటాపంచలు చేయుగాక!

★ ★

"రథే నోదరపత్మనా"

—తైత్తరీయం

## 64. శ్లోకం

యో శ్రీభూతాన్ రథస్యాగ్రసితుమివపురో దందశూకాన్ దధానో
ద్వేధావ్యస్తాంబువాహాపవిపిహిత బృహత్పాశి పక్షప శోభః
సావిత్రస్స్యందనోఽసౌ నిరతిశయ రయ ప్రీణితానూరురేనః
క్షేపీయో యో గరుత్మానివ హరతు హరీచ్ఛావిధేయప్రచారః

పద్యం

పన్నగాలపాములన్ పట్టిమ్రింగెడి పైన
తేయశతాంగమ్ము తెన్ను మెరసి
జీమూతవాతాల వ్యోమవీథుల వాజి
పక్షద్వయము వీచి బాగుచేసి
గమనాతిశయమున గరుడాగ్రజుని మది
కెంతయో అమిత సంతృప్తిగూర్చి
హరి మనోభావాలునెరిగి మనోహర
ప్రామాణ్యపద్ధతి పదములాన్చి

గమనభంగిమలందలి గరిమ హెచ్చ
ప్రాగ్దిశాభూమి పరమపావనముచేసి
వచ్చుచున్నది దినకర స్వర్ణ రథము
రత్న నీరాజనం బీయరా! కుమార!

## వ్యాఖ్య

అదిగో! విభాకరుడి విజయరథం. ప్రజలకు వెలుగులు చూపే పవిత్రరథం. అది అచ్చు గరుడాశ్వారుడివలె ఉన్నది. ఆ స్యందనం అందమే వేరు. ఈ రథానికీ గరుత్మంతుడికీ ఎన్నో సామ్యాలున్నాయి.

రథానికి కట్టు త్రాళ్ళుగా ఉన్న సర్పాలను తినటానికి గరుత్మంతుడు ముందుకు దూకుతున్నాడా అన్నట్లు రథం ముందుకు పయనిస్తున్నది. ఆ రథ గమనవేగానికి మేఘపటలి రెండుగా చీలి గరుడాశ్వారుడి ఉభయపక్షాలవలె భాసిస్తున్నాయి.

ఆ స్యందన గమనం అరుణసారథి అంతరంగానికి ఆనంద కారణంగా అనిపిస్తున్నది. ఆ గరుడరథం హరి ఇచ్ఛపై నడుస్తున్నది. గుర్రాలు కోరికతీర తమ తమ ప్రతాపం చూపిస్తున్నాయి. గరుడుడుగా ఉన్న ఆ రథం హరి సంకల్పానుగుణంగా నడుస్తున్నది.

గరుత్మంతునివంటి ఆ సూర్యరథం పాపజాతిని పారద్రోలుగాక!

★ ★

"శన్నో భవత్వర్యమా"

—తైత్తిరీయం

## 65. శ్లోకం

ఏకాహ్నైవద్రాఘ్నాం, త్రిభువనపదవీం లంఘయన్యో లఘిష్ఠః
పృష్ఠే మేరోర్గరీయాన్ దళితమణిదృషద్విం్షి పింషింశిరాంసి
విశ్వస్యైవో పరిష్ఠాపపిచ పునరథస్తాదివాస్త్రాద్రిమూర్ధ్ని
బ్రధ్నస్యావ్యాత్సజాతో దురధిగమపరిస్పందనః స్యందనో వః

### పద్యం

దివసమ్ములోపలే దీర్ఘత్రిభువనాలు
లంఘించు జవముతో లఘువులైన
బహుళ పర్యాశ మేరుపర్వత వజ్రాల
పరిమర్దనముచేత గురువులైన
భువనమ్మునకు శిరోభూషణ శ్రేష్ఠమై
మెరుగులీనుటచేత మీదునైన
అస్తశైలముజేరి అఖిల విశ్వమునకుం
క్షీమణియగుటచేత క్రిందునైన

సూర్యరథమది వచ్చెను చూడవోయి!
లఘువో - గురువో - మింటిపయి పైలాడునదియో -
క్రిందినూపురంబైనదో - సందియంబె
రత్న నీరాజనం బియరా! కుమార !

వ్యాఖ్య

అదిగో! రమణీయమ రవిరాజ రథం వస్తున్నది. వస్తూ వస్తూ ఎన్నెన్నో శుభములను తెస్తున్నది. ఆ రథం తత్త్వం తెలిసికొనటం ఎవరికీ సాధ్యంకాదు.

ఆ సూర్య స్యందనం ఒక్కరోజులోనే త్రిభువనమంతా అతి సులభంగా ప్రయాణంచేసి "లాఘవం" ప్రదర్శిస్తున్నది. ఆ స్యందనం మేరుపర్వతంపైనుండే వజ్ర మణిమయ శిఖరాలను చక్ర ఘాతాలచేత చూర్ణంచేసి తన "గౌరవం" నిలుపుకొంటున్నది.

ఆ రథం విశ్వం ఊర్ధ్వభాగంపై విశిష్ట విలక్షణ కాంతులతో విరాజిల్లుతున్నది. సాయం సమయంతో అస్తాద్రిని జేరి విశ్వానికి క్రింది భాగంలో సంచరిస్తున్నది.

ఈ రథం తత్త్వం ఎవరికీ అర్థమయ్యేదికాదు. ఇది లఘువో, గురువో, సర్వోపరియో, సర్వమూలప్రాయమో తెలియటంలేదు. ఇటు వంటి అంతుపట్టని పరమాత్మ తత్త్వంగల సూర్యరథం ప్రజలను సంరక్షించుగాక !

★ ★

"దేవాసుర నమస్కృతాయ నమః"

## 96. శ్లోకం

మూర్ధ్న్యస్తాగ్ర్యగ్రహాణి ధ్వజపటపవనాందోళితేందూనిదూరం
రాహోర్గ్రాసాభిలాషాదనుసరతి పునర్దత్తచక్రవ్యథాని
శ్రాంతాశ్వశ్వాసహేలాధుతవిబుధధునీ నిర్ఝరాంభాసిభద్రం
దేయాసుర్వో దవీయో దివిదివసపతేస్స్యందనప్రస్థితాని

## పద్యం

ఉన్నతశిఖరాల ఉష్ణరశ్ములచేత
దుష్టగ్రహాలను దోలివైచి
వైజయంతీ పట వాతోద్ధతమ్ముచే
లీల చంద్రుని కదిలించి మించి
మింటి మెట్టులలోన మ్రింగవచ్చెడి రాహు
వునకు చక్రవ్యథ లొనరజేసి
తూర్ణతురంగాల నూర్పుగాడ్పులచేత
గగనగంగాధార కెగురగొట్టి

విష్ణు పదమున కాంతులు విస్తరింప
చిత్రచిత్రమ్ముగా మహాచిత్రభాను
రథము వచ్చెను అరుణ సారథ్యమందు
తన్ను నీరాజనం ఏయగా! కుమార!

వ్యాఖ్య

అదిగో! మహారథం. మానవుల మనోరథం. సూర్యరథం. ఆకాశ మహాపథంలో విశ్వోపకారార్థమై అరుణరథం వస్తున్నది.

అదిగో! రథం అగ్రభాగం బాగా ప్రకాశిస్తున్నది. ఆ ప్రకాశంలోని తేజోజ్వాలలు కుజగ్రహాలకు అశనిపాతాలౌతున్నాయి. అదిగో! రథంపైన సౌవర్ణపతాకం మెరుస్తున్నది. ఆ జెండా రెపరెపల గాలికి చంద్రుడంతటివాడు చలించిపోతున్నాడు.

అదిగో! ఆ ప్రక్క చాటుచాటుగా వచ్చేది రాహువు. సూర్యుణ్ణే మ్రింగాలని వాడి దురాలోచన. పొంచిపొంచి వస్తున్నాడు. వాడికి సూర్యరథం మణుల చక్రబాధ కలిగిస్తున్నది. అవిగో! సూర్యాశ్వాలు ఉదయంనుండి పరుపెత్తి పరుపెత్తి బడలికలుచెంది నిట్టూరుస్తున్నాయి పాపం! ఆ వేడివేడి నిట్టూర్పులకు ఆకాశ గంగాజల తరంగాలు చెదిరిపోతున్నాయి.

సూర్యరథం ఎంత అందంగా వస్తున్నది. బంగారుగంటలు మ్రోగుతున్నాయి. ఆ కింకిణీధ్వనులు ఆ రథగతులు ప్రజలకు సుగతులు కలిగించుగాక!

★ ★

"సముద్యతే నమః"

## 67. శ్లోకం

అక్షేరక్షాం నిబధ్య ప్రతిసరవలయైర్యోజయంత్యో యుగాగ్రం
ధూప్తస్తంభే దత్తధూపాః ప్రహితసుమనసో గోచరే కూబరస్య
చర్చాంచక్రే దధత్యో మలయజరజసా సిద్ధవధ్వస్త్రిసంధ్యం
వందంతే యం ద్యుమార్గే స నుదతు దురితాన్యంశుమత్స్యందనో వః

### పద్యం

చక్రాల వేగమ్ము చకచకాసాగగా
అశ్వమ్ములకు సూర్య రక్షగట్టి
వస్త్రలాని మెదల కొడిఅంచులకును
రమణీయమైన తోరములుచుట్టి
అందాలు చిందాడు స్యందనమ్మున కగ్ర
భాగాల కగరు ధూపములుపెట్టి
చక్రాల ఇరుసుకు చందన ద్రవముతో
దినము దినమ్ము వందియనపెట్టి

అరుణసారథి రథము తయారుచేసి
తెచ్చుచున్నాడు వేల్పు ముద్దియలు మ్రొక్క
మూడులోకాలవాను పూలుజల్ల
రత్న నీరాజనం బీయరా! కుమార !

## వ్యాఖ్య

అదుగో! అరుణ అనూరుడు రథం నడుపుకొని వస్తున్నాడు. ఎంత పెద్ద రథం అది. అది విశిష్టంగా విలక్షణంగా వినూత్నంగా విరాజిల్లుతున్నది. అవి ఆకాశాన ఎంత సోయగంగా నడుస్తున్నది.

ఆకాశంలో సిద్ధ సీమంతినీమణులు అరదం బండి కంటికి రక్ష కట్టారు. సురవరూథినీమణులు రథం కాడి అంచులకు మంగళ కరంగా మాలతీ మల్లికా మాలలు కట్టారు. ఆ భామామణులు రథం ముందుభాగంలో నిలబడి అగరు ధూపాలువేసి దిష్టి తీశారు.

ఆ కాంతామణులు కాడికట్టే నొగలలో పుష్పమాలికలు అలంకరించారు. ఆ చందనగంధులు చక్రానికి చందనం పూసి పూజిస్తున్నారు. ఇలా రోజూ మూడువేళల ఆ ఇంతులు పూబంతులు పెట్టి ఆదిత్య రథానికి అలంకరిస్తారు. అలా ఆ పూబోణులు రథాన్ని రంగరంగవైభోగాలతో అర్చించి అంజలిఘటిస్తున్నారు.

అటువంటి మహామణిపుంజాల మహిమాన్విత మార్తాండ రథం మనోవేగంగా వస్తున్నది.

★ ★

"మంగళమస్తు"

## 68. శ్లోకం

ఉత్కీర్ణస్వర్ణరేణు ద్రుతఖురదళితా పార్శ్వయోశ్శశ్వదశ్వై
రశ్రాంత భ్రాంతచక్రక్రమనిఖిలమిలన్నేమినిమ్నా ధరేణ
మేరోర్మూర్ధన్యఘం వో విఘటయతు రవేరేకవీథీ రథస్య
స్వోష్మోదక్తాంబురిక్తప్రకటితపులినోద్ధూసరా స్వర్ధునీవ

### పద్యం

గుర్రాల గిట్టల క్రూరఘాతమ్ముల
    స్వర్ణపాషాణాలు చూర్ణమయ్యె
నిరతమ్ము చక్రాలు దొరలు తాకిడిచేత
    లోతుగా రహదారి గోతులుపడె
అధిక నిదాఘమ్ము అగ్నిని విరజిమ్మ
    వనమెండి పులినముల్ బయటపడెను
స్వర్గంగ ప్రవహించు సర్వప్రదేశాలు
    రిక్తమై పలుధూసరితములయ్యె

ఏకమార్గాన కడు మండుటెండలందు
మేరుపర్వత శిఖరాలమీద నుంచి
ద్వాదశాత్ముని అరదమ్ము వచ్చుచుండె
రత్న నీరాజనం బీయరా! కుమార!

## వ్యాఖ్య

అదిగో! తూర్పుదిక్కున బంగారురజం ఉవ్వెత్తుగా లేస్తున్నది. ఆ వచ్చేది సూర్యరథం. అది రథగమన చక్రధూళి. ఆ దృశ్యం ఎంత మనోహరంగా ఉన్నది.

గుర్రాలు పరువెత్తుతూ వాడియైన ఇనుప గిట్టలతో మేరు పర్వత శిఖరాలను చూర్ణం చేస్తున్నాయి. ఆ చూర్ణం తూర్పు దిశాంగణం అంతా వ్యాపించింది. రథచక్రాల పట్టాల అంచులు తగిలి ఎడతెగని రాపిడివల్ల కాబోలు దారి అంతా గోతులుపడ్డాయి. చక్రాలు కూడా గౌరవం కలవే. ఆ దారికాని దారిలో అనూరుడు కాబట్టి రథాన్ని నడుపగలుగుతున్నాడు.

రథం వేడిమితగిలి ఎక్కడ నీరు అక్కడే ఇగిరిపోతున్నది. అందుచేత ఇసుకదిబ్బలు బయలుపడ్డాయి. ఆకాశ గంగానదీ తీర భూములు నీ రెండి ధూళిధూసరితాలైనాయి. ఇది సూర్యరథ ప్రభావం.

సుమేరు గిరిశిఖరం పై భాగాన రథమార్గం ఒకటే కనిపిస్తున్నది. ఆ ఏకచక్రమార్గం ప్రజలను సన్మార్గంలో నడుపుగాక!

★ ★

“వివస్వతే నమః”

## 69. శ్లోకం

నంతుం నాకాలయానామనిశముపయతాం పద్ధతిః పఙ్క్తిరేవ
క్షోదో నక్షత్రరాశిర్వ్యశరయమిళ చ్చక్రపిష్టస్య ధూళిః
హేషా ప్రోథో హరీణాం సురశిఖరిదరీః పూరయన్నేమినాదో
యస్యావ్యాత్తీవ్రభానోస్స దివి భువి యథావ్యక్తచిహ్నో రథో వః

### పద్యం

సతతమ్ము సాష్టాంగనతు లర్పణము సేయు
సురసంఘమన్నదే సరణికాగ
సత్వరమ్ముగ వచ్చు చక్రవేగమ్ములో
నలుగు నక్షత్రాలు ధూళికాగ
గుహలలో మార్మ్రోగు గుర్రాల సకిలింపు
రేకి చక్రమ్ము క్రేంకృతులుకాగ
చిహ్నముల్ కనిపింపచేయుచు వచ్చెడి
దివము సైతము పెట్ట అవనికాగ

శ్రీఅనూరుడు సారథి ప్రీతినడుప
ద్విజవరేణ్యులు వేదాలు విశదపరుప
తళుకులీనుచు సూర్యరథమ్ము వచ్చె
రక్ష నిరాటనం సేయరా! కుమార !

వ్యాఖ్య

రథం భూమిమీద పయనించేటప్పుడు మార్గం తెలుసుకో టానికి భూమిపైన ఏవో కొన్ని చిహ్నాలు కనిపిస్తాయి. కానీ ఆకాశ మార్గాన గుర్తులేమిటి? దేవతల వరుసలు - నక్షత్రధూళి - పాలపుంత మార్గం - మయూరక్రేంకారాలు ఇవి సూర్యమార్గపు చిహ్నాలు.

అదిగో! అటువైపు అపరంజి వెలుగులు ప్రసరిస్తున్నాయి. లోకబాంధవుని రథం వస్తున్నది.

సూర్యదేవుడు వస్తాడని సురకోటి అంతా నిలబడి అంజలి ఘటించి ఆదిత్య హృదయం పఠిస్తూ ప్రతీక్షిస్తున్నది. స్వామికి అర్ఘ్య పాద్యార్చనకై బారులుతీరారు దేవతలు. అందువల్ల ఇదే మార్గమని తెలుస్తున్నది. రథచక్ర ధాటికి లక్షల నక్షత్రాలు చూర్ణమై సన్నని ధూళిగా తయారయ్యాయి.

గుర్రాల సకిలింపు ధ్వనులే మేరుపర్వత గుహలలోపల నేమిధ్వనులుగా వినబడుతున్నాయి. ఆకాశంలోకూడా భూమిమీదలా మార్గచిహ్నాలను కనిపింపచేస్తున్న సూర్యరథం శుభముల నొసగుగాక.

 

"భువనేశ్వరాయ నమః"

## 70. శ్లోకం

నిస్పందానాం విమానావలితతదివాం దేవబృందారకాణాం
బృందైరానందసాంద్రోద్యమమపి వహతాం విందతాం వందితుం నో
మందాకిన్యామమందః పులినభృతి మృదుర్బంధురే మందిరాఖే
మందారైర్మండితారం దధదరి దినకృత్స్యందనస్స్యన్మదే వః

### పద్యం

సైకతమెక్కడా ఆకాశగంగలో
  సైతమ్ము మందమ్ము సైపకుండ
పరమసంతోషాన పరువెత్తుకొనివచ్చు
  అమరముఖ్యులకును ఆపకుండ
బహుళ విమానాలవచ్చువారలపైన
  మందరాద్రి చిరాకుచెందకుండ
ఆనంద మందార హారాలు అర్పించు
  వీరహారతులను వీడకుండ

లాంఛనములు చక్రాల అలంకరించి
సవ్యరీతుల సారథి నడుపుచుండ
అరుగుదెంచెను అందాల అరుణరథము
రత్న నీరాజనం బీయరా! కుమార!

## వ్యాఖ్య

అదిగో! అరవిందబంధుని అరదం. ఎంత అందంగా వస్తున్నది. ఎంత కాంతిమయంగా ఉన్నది!

రథం వచ్చేమార్గం ఆకాశగంగా సైకత ప్రదేశం. ఇసుకలో కూరుకుపోతున్నాకూడా రథ గమనవేగం తగ్గటంలేదు.

ఆదిత్య సత్యభగవానుడు వస్తున్నాడని పూజాపుష్పాంజలి సమర్పిద్దామని ఆనందంతో అమర ముఖ్యులు పరుగెత్తుకొని వస్తున్నారు. క్షణకాలంలోనే ఆ రథం ఆగకుండా వెళ్ళింది. అర్చనావకాశం లభించలేదే అని అమరులు దిగులుపడ్డారు.

కొందరు పట్టువిడువక ఎలాగైనా ప్రభువు నర్చించాలని విమానాలలో విభాకరరథం వెంటపడ్డారు. నగరతుల్యమైన మందరగిరి దగ్గర వేగం కొంత తగ్గటంవల్ల వారికి అక్కడ అర్చనావకాశం లభించింది.

అమరార్చన అందిన రథం, చక్రాలు, ఆకులు, కడు శోభాయమానంగా ఉన్నాయి. ఆ పూజారథం మీ మనోరథం నెరవేర్చుగాక!

★ ★

"రశ్మిభావనాయ నమః"

## 71. శ్లోకం

చక్రీ చక్రారపంక్తిం హరిరపిచ హరీన్ ధూర్జటిర్ధూర్ధ్వజాంతా
నక్షం నక్షత్రనాథోఽరుణమపి వరుణః కూబరాగ్రం కుబేరః
రంహస్సంఘస్సురాణాం జగదుపకృతయే నిత్యయుక్తస్య యస్య
స్తౌతి ప్రీతిప్రసన్నోఽన్వహమహిమరుచేస్సోఽవతాత్స్యందనో వః

### పద్యం

శక్తిసంపన్న మా చక్రపంక్తిని చేరి
చక్రాయుధుడు అత్మసన్నుతింప
కాంభోజ వాజ్ఞీన గంధర్వములజేరి
పాకశాసనుడాట ప్రస్తుతింప
వన్నెకీను శతాంగ ధ్వజయంత్రిని చేరి
చంద్రమౌళిస్వామి జయముపలుక
అతి ముఖ్యమైనట్టి అక్షదండముఁజేరి
నక్షత్రనాథుడు నుతులు నేయ

అరుణసారథికి వరుణు డంజలింప
కూబరమ్మును ధనదుడు కూర్మికొలువ
శ్రీఘ్రమునన సురల్ పొగడ - ఓప్పెనె రథము
రత్న నీరాజనం బీయరా! కుమార !

## వ్యాఖ్య

అదిగో! అది సూర్యభగవానుడి మహిమాన్వితమైన మహా రథం. వివస్వత మహారాజరథం. విశ్వమంగళ ప్రభాత విలాస విజయ రథం. జనోపకృతి కావించే మనోరథం.

ఆ సూర్య స్యందనం చక్రప్రభావాల్ని శ్రీమహావిష్ణువు స్తవంచేసి నిత్యనూతనం చేస్తుంటాడు. ఆ ఆదిత్య మహాశ్వాలను దేవేంద్రుడు నిత్యం పూజాపారిజాతాలతో అర్చిస్తుంటాడు. ఆ సప్తాశ్వుడి శతాంగం అగ్రభాగాన ప్రకాశించే స్వర్ణపతాకాన్ని శంకర స్వామి స్మరిస్తూ ఉంటాడు.

ఆ అరుణమూర్తి రథచక్రపు బండి కంటిభాగాన్ని అమృతాంశుడు అనుక్షణం కనిపెట్టి ఉంటాడు. ఆ ప్రభాకరస్వామి విజయ రథసారథియైన అరుణుణ్ణి వరుణుడు స్తుతి చేస్తుంటాడు. ఆ మార్తాండుడి రథపు కాడి గట్టు నొగ ప్రదేశాన్ని కుబేరుడు కాపలా కాస్తుంటాడు. ఆ త్రయీతనుడి వేటి వేగాన్ని దేవతాబృందం అంతా వంది మాగధులై స్తవం చేస్తుంటారు.

ఇలా దేవదేవాధిపతులు సూర్యరథ రక్షణ కావిస్తున్నారు. లోకోపకారంకోసం నిత్యం శ్రమించే త్యాగజీవికి సహాయపడి సత్కరింపనివారు ఎవరుంటారు.

 

“సర్వదేవాత్మకాయ నమః”

### 72. శ్లోకం

నేత్రాహీనేనమూతే విహితపరికరస్సిద్ధసాధ్యైర్మరుద్భిః
పాదోపాంతేస్తుతోఽలం బలిహరిరథసాకర్షణాపృద్ధవేగః
భ్రామ్యన్ వ్యోమాంబురాశావశిశిరకిరణస్యందనస్సంతతం వో
దిశ్యాల్లక్ష్మీమతుల్యామతులితమహిమాపేః వాపరో మందరాద్రిః

పద్యం

సుందరాకాశమ్ము సువిశాల సంద్రమై
రవితేరు మందర భ్రాంతియుండె
వికలుడౌ సారథి విహిత పరికరాల
సారథ్యమున సుప్రశస్తినందె
రథమందరమ్ము తురంగ కింపురుష సా
ధ్యులచేత మధుర సంస్తుతులనందె
బలిహరికర్షణా బద్ధమై రథ మంద
రాకాశ శీఘ్రమ్ము అతిశయించె

మందర గిరీంద్రమా? రవి స్యందనంబ?
అనిన విధముగా విష్ణుపదాబ్ధియందు
రథము ఏతెంచుచుండె శీఘ్రమ్ముగాను
రత్న నీరాజనం బీయరా! కుమార!

## వ్యాఖ్య

అదిగో! ఆకాశం అపార పారావారంగా శోభిస్తున్నది. అందులో సూర్యరథం మందర పర్వతంవలె దధిభాండంలో కవ్వం రీతిగా తిరుగుతున్నది.

మయూర మహాకవి ఆ దృశ్యాన్ని కమనీయంగా కల్పన చేశాడు. నేత్రాహీనేనుడు అని శ్లేషనిబంధించాడు. వికలుడైన అనూరుడిచేత రథం బాగా బాగుచేయబడింది. నేత్ర అహిఇనుడు కరచరణాలులేని సర్పరాజు మందర మహీధర మూలభాగానికి కవ్వపు త్రాడువలె కట్టబడ్డాడు. అని రెండర్థాలు అమరినాయి.

రథచక్ర సమీపంలోను, రథచక్రాలకు సిద్ధులు సాధ్యులు పూలుచల్లి పూజ చేస్తున్నారు. మందరగిరికి దేవతలు పూజలు చేస్తున్నారు.

రథం బలమైన హరిదశ్వాలచేత కర్షణాబద్ధమై ప్రయాణిస్తున్నది. మందరం బలి అనే రాక్షసరాజుచేత హరి అనే ఇంద్రుడిచేత కర్షణాబద్ధమై వేగంగా గిరగిరా తిరుగుతున్నది.

మందరగిరివంటి సూర్యరథం మానవుల మనోరథాలను తీర్చి మనోవేదనలను తొలగించుగాక!

 

"సారంగాయ నమః"

# సూర్యమండలము

## 73. శ్లోకం

యజ్జ్యాయో బీజమహ్నామపహతతిమిరం చక్షుషామంజనం య
ద్ద్వారం యన్ముక్తిభాజాం యదఖిలభువనజ్యోతిషామేకమోకః
యద్వృష్ట్యంభోనిధానం ధరణిరససుధాపానపాత్రం మహద్య
ద్దిశ్యాధీశస్య భాసాం తదవికలమలం మంగళం మండలం వః

### పద్యం

దివస కేదారాల తీరుతియ్యమ్ముల
వెలుగుపంటకు మంచివిత్తనమ్ము
అంధకారంబెల్ల అపహరించుటకుగాన్
అక్షియుగమ్మున కంజనమ్ము
అపవర్గధామమ్ము అరుగుదెంచెడి పరి
వ్రాజకులకు మహాద్వారసీమ
లోకమ్ములోగల శోకభీకరమైన
హరితేజములకు ఏకాశ్రయమ్ము

వర్షజలముల కాధార హర్షధార
వసుమతీసిరు ద్రావెడు పానపాత్ర
అట్టి సూర్యమండల మదే! అంజలించి
దర్శనము చేసికొమ్ము ఆదర్శబాల!

వ్యాఖ్య

అదిగో! ఆ కనిపించేది సుందర సుదీర్ఘ సువిశాల సువర్ణ సూర్యమండలం. అది సు ప్రభావంతము.

ఆ అర్కమండలం అహస్సులకు అద్భుతావహమైన అంత ర్బీజం. ఆ భాస్కరబింబం జీవకోటి నేత్రాలకు అంజనౌషధం. ఆ జ్యోతిర్మయమండలం యోగులకు భక్తులకు ముక్తిపుర ప్రవేశార్హత కలిగించే జ్వాలాతోరణద్వారం. ఆ తేజోమండలం జగత్తులోని సకల కాంతిపుంజాలకు ఏకైకాశ్రయ కేంద్రస్థానం.

ఆ ఆదిత్యమండలం సకలవర్షాలకు హేతువు. సర్వ జల రాశికి ఆధారం. అది సకల చరాచరకోటి పృథ్వీమీదగల నీటిని త్రావే సుధా పానపాత్ర.

అది అఖండ సూర్యమండలం. ప్రచండ తేజోరాశిక్యం. అది మంగళాలకు మారుపేరు. అది సంపూర్ణ శ్రేయస్సులు అందించే ఆదిత్య చక్రం.

 

"భాస్కరాయ నమః"

### 74. శ్లోకం

వేలావర్తిష్ణుసింధోః పయఇవ ఖమివార్కోద్గతాగ్ర్యగ్రహౌఘ
స్తోకోద్భిన్నాస్య చిహ్నాప్రసవమివ మధోర్భాస్వమస్యన్మనాఽసి
ప్రాతఃప్రాప్తోఽశుభాని ప్రశమయతు శిరశ్శేఖరీభూతముద్రేః
పౌరస్త్యస్యోద్గభస్తి స్తిమితతమతమఃఖండనం మండలం వః

### పద్యం

రత్నాకరముపోలె రసరాజమై భవ్య
    వేలాంతరములందు వృద్ధిబొంది
ముత్యాలకదలియై ముచ్చటగొల్పుచు
    గ్రహములపీఠమై గరిమమెరసి
చైత్రర్తుప్రారంభజనిత కోరకముతై
    ఆకాశవనముల అందగించి
ఉదయపర్వతరాజ్ఞి ఉత్తమాంగముపై
    రంజితరత్నమై రమణకెక్కి

గగనసరసిలో కమలమై కళలు చిలికి
తూర్పు పైదలి తిలకమై దొరగించి
మరి ప్రకాశించె దినకర మండలమ్ము
దర్శనము చేసికొమ్ము ఆదర్శబాల !

## వ్యాఖ్య

అదిగో! సూర్యమండలం. ఈ అఖండ జ్యోతిర్మండలం తూర్పుకొండపై దర్శనీయంగా ఉన్నది. కన్నులపండువ చేస్తున్నది.

అది పాలసముద్రంవలె వేలావర్ధిష్ణువు. నియమిత సమయాలలో అభివృద్ధి చెందుతుంది. ఆకాశంవలె నిర్మలంగా ప్రకాశిస్తున్నది. అది అన్ని ప్రధాన గ్రహకేంద్రాలకు నివాసస్థానం.

ఆదిత్యమండలం వసంత ప్రారంభంవలె స్వచిహ్న ప్రసవాలను దర్శింపజేస్తుంది. మండల కాంతిస్పర్శకు కొన్ని పుష్పాలు వికసిస్తాయి. పుష్పాలు ప్రభాకరమండల మండితాలు. మరికొన్ని సూర్య చిహ్నితావిర్భవాలు. భానుడికి పద్మినీవల్లభుడు, లోకబాంధవుడనే పేర్లు అందుకే వచ్చాయి.

భానుమండలం మానవమానసాలకు మహానందం కలిగిస్తుంది. ఆ భాస్కరమండలం ఉదయవేళ పూర్వపర్వత శిఖరాలకు అలంకారాభరణం. ఆ సూర్యమండల కిరణాలు ఊర్ధ్వదిశా ప్రసరితాలు.

అది ఆదిత్యమండలం. అశుభాలను అణచివేయటంలో అద్వితీయం. అంజలి ఘటించండి.

 

"బ్రహ్మణే నమః"

## 75. శ్లోకం

ప్రత్యుప్తస్తప్తహేమోజ్జ్వలరుచిరచలః పద్మరాగేణ యేన
జ్యాయః కింజల్కపుంజం యదళికులశితేరంబరేందీవరస్య
కాలవ్యాళస్యచిహ్నం మహితతమమహోమూర్ధ్నిరత్నం మహాద్యు
ద్దీప్తాంశోః ప్రాతరహ్నాత్తదపచితజగన్మండనం మండలం వః

### పద్యం

తప్తకాంచన పూర్వ ధరణీధరమ్ముపై
కట్టిన పద్మరాగమ్ముపోలె
చదలేటి కల్హార షట్పదమ్ములమీద
సుడిగొను పసుపుపుప్పొడివిధాన
కాలపన్నగ శిరో నీలవర్ణము పైని
తనరారు అరుణ రత్నమ్ము భాతి
విశ్వసుందరి కంఠ విపుల ప్రదేశాన
శుభకర మంగళసూత్రమటుల

విద్రుమము లారబోసిన విధముగాను
పసుపు కుంకుమ కాంతులు ప్రతిఫలింప
మంగళకరమ్ముగా సూర్యమండల మదె
దర్శనము చేసికొమ్ము ఆదర్శబాల!

వ్యాఖ్య

అదిగో! ఆదిత్యమండలం. ఎంత మనోజ్ఞంగా ఉన్నది. అది ఈ ప్రాతఃకాలంలో ప్రకృతికి బంగారు భూషణంలాగా ఉన్నది.

ఉదయ సమయంలో పూర్వదిశాభూమి బంగారు ముద్దవలె ఉన్నది. అందులో ప్రాచీన పర్వతంపై ప్రభాకరమండలం పద్మరాగ మణివలె భాసిస్తున్నది.

ఆకాశం నల్ల కలువవలె ఉన్నది. దానిమీద భ్రమర నీలిమ కాంతివలె వెలుగులు వ్యాపించినాయి. ఆ అళిరాజ నీలిమలపై తగులు కొన్న పుష్పాడి సముదాయమా అన్నట్లున్నది సూర్యమండల చ్ఛవి.

కాలము కాళీయ సర్పంవలె ఉన్నది. కాళీయుడి శిరముపై మహారత్నంవలె ప్రకాశిస్తున్నది ప్రభాకరమండలం. ఆ మండలం జగత్తుకు మహామండనంగా మంగళకరంగా శోభలు విరజిమ్ముతున్నది.

ఆ సూర్యమండలం మహాప్రజకు మంగళములు అందించు గాక!

 

"విష్ణవే నమః"

## 76 శ్లోకం

కస్త్రాతా తారకాణాం పతతి తనురవశ్యాయబిందుర్యథేందు
ర్విద్రాణా దృక్స్మరారేరురసి మురరిపోః కౌస్తుభో నోద్గభస్తిః
వహ్నేస్త్వహ్నాపహ్నుతైవ ద్యుతిరుదయగతే యత్ర తన్మండలం వో
మార్తాండీయం పునీతాద్దివి భువిచ తమాంసీవ ముష్ణన్మహాంసి

### పద్యం

నక్షత్ర దీధితుల్ రక్షకుండును లేక
తారాపథమునుండి తప్పుకొనగ
శ్రీలక్ష్మితమ్ముడు శ్రేష్ఠకళానిధి
మంచుబొట్టు విధానమౌనుకేగ
నీలకంఠస్వామి నేత్రకల్హారమ్ము
మొద్దునిద్దురజెంది మూతపడగ
కమలనాథుని మహాకౌస్తుభరత్నమ్ము
విస్తుపోవుచు వెలవెల్లవోవ

వహ్నితేజమ్మువెల్ల అపహ్నవింప
తిమిరము హరించి దివ్య తేజములు పెంచి
అరుణమండల మల్లదే అరుగుదెంచె
దర్శనము చేసికొమ్ము! ఆదర్శదాత!

## వాక్శక్తి

అదిగో ! అది మార్తాండ మండలం, మంగళకరంగా సాక్షాత్కరిస్తూ అపరంజి కాంతులను విరజిమ్ముతున్నది. దిశలు సర్వం హారిద్రమయం. సవితృ కాంతిమయం.

ఆకాశ వీథిలో ఆదిత్యదేవుడి సత్యదీధితులు చూచి రేరాజు చిన్నబుచ్చుకొన్నాడు. ఆయన ముఖం ఆవగింజంత అయింది. ఇది గమనించి కానికాలం వచ్చిందని తారకలు తమదారి తాము చూచుకొంటున్నాయి.

సూర్యమండల తేజస్సు గమనించి దయాకరుడైన శంకరుని కన్ను నిదురలోకి వెళ్ళింది. వెన్నుడి ఎదపై కౌస్తుభం కాంతులు కుంఠితం కాసాగాయి. అగ్నిహోత్రుడు ఇది ఎవరి తేజస్సు అని ఆశ్చర్యపోతున్నాడు.

మార్తాండ మండలం దివ భువి అంతరాళాల అంతటా మహో తేజస్సులను విరజిమ్ముతున్నది. తిమిరం ఎక్కడా నలుసంత కూడా కనిపించటంలేదు. ఎంత మంచిరోజులు వచ్చాయి మానవాళికి! అజ్ఞానాంధకారం అంతరించి అర్కకాంతులు అంతటా నిండాయి. శుభం.

★ ★

"శివాయ నమః"

## 77. శ్లోకం

యత్ప్రాచ్యాం ప్రాక్చకాస్తి ప్రభవతిచయతః ప్రాచ్యసావుజ్జిహానా
దిత్థం మధ్యే యదహ్నోభవతి తతరుచా యేన చోత్పాద్యతేఽహః
యత్పర్యాయేణ లోకాన్ ప్రతపతి జగతాం జీవితం యచ్చతద్వో
విశ్వానుగ్రాహి విశ్వం సృజదపిచ రవేర్మండలం ముక్తయేఽస్తు

### పద్యం

ఎయ్యది ఉదయింప ఎల్ల ఆశలకద్ది
శ్రీరస్తు అంచు ప్రాచీనమగునో!
ఎయ్యది ప్రభవింప ఎల్లకాలమునందు
దిద్దిన యట్లువ్వి దినములగునో!
ఎయ్యది దీపింప ఎల్ల జగత్తుకు
ప్రాముఖ్యమైనట్టి ప్రాణమగునో!
ఎయ్యది దర్శింప ఎల్ల విశ్వమునకు
రక్షణ కార్య కారణము నగునో!

అది ప్రకాశించు - పెల్చు మధ్యాహ్నమందు
అయిన అభ్యుదయంబగు అఖిలమునకు
ఆ ప్రభాకర మండల మరుగుదెంచె
దర్శనము చేసికొనుము! ఆదర్శబాల!

## వ్యాఖ్య

అవిగో! అవి అర్కమండల మనోహర దీప్తులు. మంగళకరంగా ఆ ఉదయించేది ప్రాచీన దిశ. సూర్యుడు ఎటు పొడిస్తే అటు తూర్పు. దిక్కులేనివారికి దిక్కు తెలియనివారికి దిక్కు చూపెట్టేది దినకర సార్వభౌముడు. దినకరుడు కనిపిస్తే అది సుదినం.

మార్తాండ మహా మండలం దినభాగం ప్రకాశవంతంగా వెలుగుతున్నది. మార్తాండుడు వస్తేనే శుభోదయం తెలుస్తుంది. మార్తాండుడువల్లనే మధ్యాహ్నం గ్రాహ్యమవుతుంది. సవితృదేవుడు సాయంకాలం కలుగజేస్తాడు. అర్కుడున్నప్పుడే అహము. ఆయన ఉన్నప్పుడే ఈరోజు గడిచేది.

తపనుడు ఉష్ణకిరణ ప్రసారంచేసి మూడు జగాలను తపింపజేస్తాడు. తపనుడు తపింపజేయటం ప్రజల క్షేమం కోసమే. జీవకోటి చైతన్యం కోసమే. అలా చేయటం జీవుల అభివృద్ధి కొరకే. అది ప్రజలకు ప్రాణదానం వంటిది.

ఆదిత్యదీప్తి అఖిల ప్రపంచానికి రక్షా కవచం. రవి మండలం మహాయోగీశ్వరులకు ముక్తిమార్గం చూపించే అఖండ జ్యోతి. ఆదిత్యుడు అందరికీ ఆరోగ్యం ప్రసాదించుగాక.

 

"స్కందాయ నమః"

## 78. శ్లోకం

శుష్యంత్యూఢానుకారా మకరవసతయో మారవీణాం స్థలీనాం
యేనోత్తప్తాఃస్ఫుటంతోఝటితితిలతులాంయాంత్యగేంద్రాయుగాంతే
తచ్చండాంశోరకాండ త్రిభువనదహనాశంకయా ధామకృత్స్నం
సంహృత్యాలోకమాత్రం ప్రలఘు విదధతస్తాన్ముదే మండలం వః

### పద్యం

ఏనాడు పాథోధు లేడును ఒక్కటు
తప్తమై బహు మరుస్థలములగునో!
ఏనాడు మేరుశైలేంద్రముల్ చూర్ణమై
నలిగి తిలప్రమాణమ్ములగునో!
ఏనాడు లోకములెల్ల ఘోరమ్ముగా
హెచ్చురోదనతో దహించబడునో!
ఏనాడు జలము ముంచెత్తి భీకరముగా
నాకవాసులుకూడ నాశమగునో!

అనిన భయమున్న వేళల అధిక తేజ
మాపి తగినట్లు వెలుగుల నందజేయు
మహిత లోకోపకా రార్కమండలమ్ము
దర్శనము చేసికొనుము! ఆదర్శబాల!

వ్యాఖ్య

అదిగో! అర్కమండలం అరుదెంచింది. ఈ తేజో మండల దర్శనం మహాపాతక నాశనం. ఎంత తేజస్సు! లోపల ఇంకెంత తేజమో! పైకి ఈ తేజస్సు మాత్రమే మనం సహించలేకున్నాము.

లోపల ఎంత వేడిమి సహించో పైకి సుందరంగా కనిపిస్తున్నది సూర్యమండలం. లోకంకోసం పొట్టలో పెనుమంటలు పెట్టుకొని ప్రాణికోటికి చాలినంతవరకే కాంతిని వారి ఉపయోగం కోసం ప్రసారం చేస్తుంటాడు స్వామి.

యుగాంతంలో ద్వాదశాత్ముడు పూర్తిగా కన్ను తెరిచాడంటే సప్తసముద్రాలు సమస్త దేశాలూ తప్తమై మండి మరుస్థలాలు అవుతాయి. కులపర్వతాలు పగిలి రగిలి తిలలంత పెంకులుగా మసి మసి నుసినుసిగా అవుతాయి.

దయాంతరంగంతో ఆదిత్యుడు ఆలోచించాడు. తన తేజం లోకానికి మేలు చేయాలికానీ కీడు చేయరాదు. మంటలతో మనుష్యులను మాడ్చరాదు. సదా మహాత్ముల తత్త్వం పరోపకారమే. "నావల్ల మేలే జరగాలి. అపకారం ఆవంత జరగరాదు" అని తన శక్తినంతా లోపలనే ఇముడ్చుకొని ఉపకారానికి ఉపక్రమించాడు. ప్రాణులకు తగినంత పరిమితంగానే తన తేజస్సును ప్రసారం చేస్తున్నాడు స్వామి.

మహాత్ముల మనస్సే అంత. ఆ ద్వాదశాదిత్య మండలం ప్రజలకు అఖండ ఆనందాలు కలిగించుగాక!

★ ★

"ప్రజాపతయే నమః"

## 79. శ్లోకం

ఉద్యద్దూద్యానవాప్యాం బహులతమతమఃపంకపూరం విదార్య
ప్రోద్భిన్నం పత్రపార్శ్వేష్వవిరళమరుణచ్ఛాయయా విస్ఫురంత్యా
కల్యాణాని క్రియాద్వః కమలమివమహన్మండలం చండభానో
రన్వితం తృప్తిహేతో రసకృదలికులాకారిణా రాహుణాయత్

### పద్యం

ఉన్నత విష్ణుపదోద్యాన వనములో
అందాల నడబావి అమరియుండె
బావిలో గహ్వర పంక సంఘాతమ్ము
పెద్దగా అడుగున పేరుకొనియె
పంకమ్ము ఛేదించి పత్ర పార్శ్వములందు
వ్యాపించసాగెను అరుణరోచి
రోచిని వెంటాడి రోలంబ రాహువు
దొంగయై రాసాగె దొడ్డిత్రోవ

పెద్ద వికచారవిందమ్ము నుద్దిమెరసి
వన్నెలీనెడి ఉదయాద్రి వచ్చుచుండె
మహిత మంగళోద్భవ సూర్యమండలమ్ము
దర్శనము చేసికొనుము! ఆదర్శబాల!

## వ్యాఖ్య

అదిగో! మంగళప్రదమైన మార్తాండ మండలం మహనీయంగా ఉన్నది. ఎంత మనోహర మండలం. అందులో ఆఖండల వైభవం అఖండంగా ఉన్నది.

ఆకాశం అందాలు చిందే ఉద్యానవనం. ఆ వనంలో రకరకాల రంగురంగుల పూలు లతలు లతాగుల్మాలు ఎన్నో! ఆ ఉద్యానవనంలో నయనానందకరంగా తూర్పుదిక్కున నడబావి. ఆ బావిలో చిమ్మచీకటి అనే అడుసు దట్టంగా పేరుకొని ఉంటే ఉష్ణరశ్మి ఉష్ణకిరణాలు అనే పదునైన పలుగులతో పరిశుభ్రం చేశాడు. ఇప్పుడెంత బాగుంది నడబావి. శుభ్రమైన జలం ఊరుతున్నది.

ఆ నడబావిలో మహా పద్మంలా ప్రకాశిస్తున్నది భాస్కర మండలం. పద్మం ప్రక్క పత్రాలు పద్మ పార్శ్వాలు అరుణ చ్ఛాయలతో అద్భుతంగా అమోఘంగా ప్రకాశిస్తున్నాయి.

ఆకాశాన ఆ బావి. బావిలో ఆ పద్మాల ప్రక్కన తెంజిగురు కాంతులు కన్నులవిందు చేస్తున్నాయి. ఆ పుష్ప సౌందర్యానికి తుమ్మెదలు మూగుతున్నాయి. ఆ పుష్పం పూషణుడువలె ఉన్నాడు. తుమ్మెదలదండు రాహువులా ఉన్నది. అసలు అరవిందాన్ని అనుసరిస్తున్నట్లు రాహువు రవిని వెంటాడుతున్నాడు. ఆదిత్యుడది లెక్కచేయటంలేదులే.

ఆ అరుణ మండలం అందరి ఆర్తిని హరించుగాక!

 

"ధనదాయ నమః"

## 80. శ్లోకం

చక్షుర్దక్షద్విషో యన్నతు దహతి పరం పూరయత్యేవకామం
నాస్తంజుష్టం మరుద్భిర్యదిహ నియమినాం యానపాత్రం భవాబ్ధౌ
యద్విత్రశ్రాంతి శశ్వద్భ్రమదపి జగతాం భ్రాంతిమభ్రాంతి హంతి
బ్రధ్నస్యావ్యాద్విరుద్ధక్రియమపి విహితాధాయి తన్మండలం వః

### పద్యం

దక్షాధ్వరధ్వంసి వీక్షణంబై ఏది
కామదాహముకాక కామదంబు
భవవార్ధి దాటించు నావయై ఏది మ
రుద్భృతకాక మరున్నుతంబు
ఇంతఆగక భ్రమియించునదై ఏది
భ్రాంతియుకాక అభ్రాంతిగూర్చు
విపరీతక్రియపట్టి విశ్వమ్ములో ఏది
అహితమింపయుకాక విహితమగును

అది నిగర్వియై బోధించు త్యాగగుణము
అలుపులేకుండ శుభములు కలుగజేయు
మంగళామోదకర మర్కమండలమ్ము
దర్శనము చేసికొనుము! అపర్ణబాల!

## వ్యాఖ్య

అదిగో! అది అర్కమండలం. అది అఖండ జ్యోతిర్మయం. దాని చర్య చిత్రాతిచిత్ర భరితం.

ఆదిత్యమండలం ఆదిశంకరుడి మూడవ నేత్రం వలెఉన్నది. ఆ నేత్రం చంచలుడైన కాముడికి దాహక కారణం. భక్తుల మనోరథాలు తీర్చుటలో కామదం. అక్కడ కామదాహకం ఇక్కడ కామదం.

ఆ ఆదిత్యమండలం మహాయోగీశ్వరులకు సంసారసాగరం దాటించేనావ. ఆ నావ ప్రభంజనంచేత భంజింపబడదు. దేవతలచేత సేవింపబడుతూ ఉంటుంది. అటు మరుత్తులంటే వాయువులు ఇటు మరుమత్తులంటే దేవతలు.

అట్లే ఆ ఆదిత్యమండలం విశ్రామంలేక నిరంతరం భ్రమిస్తు ఉంటుంది. అయినా లోకుల భ్రాంతిని అభ్రాంతిగా చేస్తుంది అంటే మిథ్యా జ్ఞానాన్ని నిస్సంశయంగా అణచివేస్తుంది.

ఇలా ప్రభాకరమండలం విరుద్ధక్రియలు చేస్తూకూడా ప్రజలకు హితమే చేస్తూఉంటుందికాని అహితం చేయదు. మేళ్ళు చేకూర్చటం దానిపని.

అట్టి సూర్యమండలం మహీస్థలిలోనూ మహాకాశంలోనూ అందరికి మహాశ్రేయస్సులు చేకూరుస్తుంది.

★ ★

"ఏతై రాదిత్య మండలమ్"

—తైత్తరీయం

# సూ ర్య దే వు డు

## 81. శ్లోకం

సిద్ధైస్సిద్ధాంతమిశ్రం శ్రితవిధివిబుధైశ్చారణైశ్చాటుగర్భం
గీత్యాగంధర్వముఖ్యై ర్ముహురహిపతిభిర్యాతుధానైర్యతాత్మ
సార్ఘ్యంసాధ్యైర్మునీంద్రై ర్ముదితతమమనోమోక్షిభిః పక్షపాతాత్
ప్రాతః ప్రారంభ్యమాణస్తుతిరవతురవిర్విశ్వవంద్యోదయో వః

## పద్యం

సిద్ధసంఘమ్ముచే సిద్ధాంత పద్ధతి
విబుధవర్గమ్ముచే విహితరీతి
చారణసమితిచే చాటుపద్యస్తుతి
గంధర్వవరులచే గానఫణితి
యక్ష పన్నగులచే ఆత్మనిగ్రహానతి
సాధ్యులచే అర్ఘ్యసంస్తవకృతి
ఋషివరేణ్యులచేత ఇచ్ఛామనోధృతి
పరివ్రాట్టుచే స్వాత్మభావనియతి

వివిధ దేవచక్రముచేత వినతులంది
వేదపారాయణుండు శ్రీవిష్ణుమూర్తి
సూర్యనారాయణుడు వచ్చె శుభకరమ్ము
నుతి మొనర్పుము సుమనోమనోహరముగ !

## వ్యాఖ్య

అడుగో! శుభం. సుందరంగా సూర్యదేవుడు సాక్షాత్కరించాడు. యోగీశ్వరబృందం స్వామిని హృదయపూర్వకంగా ఆహ్వానిస్తున్నది.

సిద్ధ పురుషులు సిద్ధాంత భాగంతీసి విధిహితంగా వినయాంజలి ఘటిస్తున్నారు. దేవతాసమూహం వేదోక్తప్రకారంగా ప్రణామాలు చేస్తున్నది. చారగణం స్వామి గుణవర్ణన కావిస్తున్నది. గంధర్వవర్గం మనోహరమంజుల మధురగానం ప్రారంభించింది.

పన్నగరాజులు ఫణాలు విప్పిప్రణమిల్లుతున్నారు. యాతుధానులు ఆత్మనిగ్రహంతో నమస్కారాలు చేస్తున్నారు. సాధ్యులు సాంజలులై అర్ఘ్యప్రదానం చేస్తున్నారు.

మహామునీంద్రులు ప్రసన్న హృదయాలతో సంస్తుతి గావిస్తున్నారు. యోగీంద్రులు స్వాత్మభావనతో ప్రశంసిస్తున్నారు. అటువంటి శుభసమయంలో విశ్వవంద్యుడైన రవిరాజు మెల్లమెల్లగా దయచేస్తున్నాడు. ఆదిత్యుడు అందరికీ ఆశీస్సులు అనుగ్రహిస్తున్నాడు.

 

"ప్రాణాయ నమః"

82. శ్లోకం

ఘాసామాసన్నఘావాదధికతర పటోశ్చక్రవాలస్యతాపాత్
ఛేదాదచ్ఛిన్నగచ్ఛత్తురగఖురపుటన్యాసనిశ్శంకటంకైః
నిస్సంగస్యందనాంగ భ్రమణనికషణాత్పాతు వప్త్రి ప్రకారం
తప్తాంశుస్తత్పరీషాపర ఇవ పరితః పర్యటన్హాటకాద్రిమ్

పద్యం

మేరమీఱి రహించు మేరుపర్వతరాజ
పాషాణ సంతప్త ప్రభలవలన
అధికోష్ణరశ్మిజాలాఖిల విలసూట్టు
హాస ప్రతాప దాహకమువలన
నిరతమ్ము పరువెత్తు తురగాంఘ్రిఖుర టంక
ఛేదన సంఘాత శిలలవలన
రథచక్ర విభ్రమ భ్రమణాశుధారల
ఉల్కలు విరజిమ్ము ఒరపువలన

ముత్తెరగు పరీక్షావిధిన్ మునిగితేలి
పసిడి గుబ్బలి చుట్టును పంతమూని
తిరుగుచున్నాడు సూర్యుడు అరుణమూర్తి !
నుతి యొనర్తును మనోమనోహరముగ !

వ్యాఖ్య

అడుగో! ప్రభాకర సార్వభౌముడు వస్తున్నాడు. మేరు పర్వతశిఖరం సమీపానికి దయచేశాడు. అడుగో కరుణమూర్తి.

సూర్యుడు మేరుపర్వత సమీపంలో ఉండటంచేత కాబోలు కాంతి సముదాయ తీక్షణమయింది. తాపం మరీ ఎక్కువయింది. సూర్యాశ్వాలు పరుగులు పెడుతున్నాయి. గరపనేలాయె. మండు టెండలో కూడా మహావేగం పుంజుకుంటున్నాయి. ఆ గుర్రాల గిట్టలు ఉక్కుఉలులవలె స్వర్ణ పాషాణాలను ఛేదిస్తున్నాయి.

ఆ సూర్యరథం అఘమేఘాలపై పరుగిడుతున్నది. రథ చక్రం భ్రమణంవల్ల విశేషంగా ఒరిపిడి కలుగుతున్నది.

ఆ సూర్యభగవానుడు ఈ విధంగా మువ్విధాలుగా బంగరుకొండను పరీక్షిస్తున్నాడా అన్నట్లున్నాడు. మేరు పర్వతం చుట్టూ ప్రదక్షిణం చేస్తున్న ప్రభాకరుడు దాని పరీక్షలో నిమగ్న మయినాడా అన్నట్లున్నాడు. ఆ లోకబాంధవుడు తన ఆలోకాలతో ఈలోకవాసుల్ని రక్షించుగాక!

"సప్తదిశో నానాసూర్యాః"

—తైత్తరీయం

* *

### 83. శ్లోకం

నోచ్చుష్కం నాకనద్యా వికసితకనకాంభోరుహం భ్రాజితం తు
ప్లుష్టానైవోపభోగ్యా భవతి భృశతరం నందనోద్యాన లక్ష్మీః
నో శృంగాణి ద్రుతాని ద్రుతమమరగిరేః కాలధౌతాని ధౌతా
సిద్ధం ధామద్యుమార్గే ప్రమదయతి దధయాయత్రతనోఽవ్యాదినో వః

### పద్యం

ఎవడు ఆకాశాన హెచ్చుగా వెలుగక
తనదీప్త తేజస్సు తరుగజేసి
ఎవడు వియద్గంగ నింకింపజేయక
చిన్ని తమ్ముల వికసింపజేసి
ఎవడు నందనవనీ చివురు లెండింపక
అమరాధ భోగ యోగ్యమ్ము జేసి
ఎవడద్రిశిరముల నిగిరింప జేయక
సర్వమంగళ ప్రకాశమ్ము జేసి

నిరతమును లోక సేవను గరపువాడు
పద్మబాంధవు డఖిల ప్రభాకరుండు
నవ్యదీప్తితో వచ్చుచున్నాడు శుభము
నుతి యొనర్పుము సుమనో మనోహరముగ !

వ్యాఖ్య

అదుగో! ఆదిత్యుడు ఆకాశ గంగాతీరం చేరాడు. ఎంతో హాయిగా ఉన్నది. స్వర్ణదీ సువర్ణ కమలాల నుంచి కమ్మని వాసనలు నాసికా పుటాలకు విందుచేస్తున్నాయి.

కమలాప్తుడు నదీ తీరానికి చేరగానే వనజాలు ఎక్కడ వాడిపోతాయోనని తన ఉష్ణ కిరణధాటి తగ్గించాడు. కిరణాలు చల్ల బరచాడు. అందువల్ల గంగాజలాలు ఇగిరిపోకుండా మిలమిలలాడు తున్నాయి. జలప్రవృద్ధంచేత స్వర్ణ జలజాలు వికసించి వినూతన కమలకషాయ గంధాన్ని అందిస్తున్నాయి. పద్మినీవల్లభుడు పరమా నందం చెందుతున్నాడు.

ఆ ప్రాంతంలో నందనోద్యానవనం శోభాయమానంగా ఉన్నది. ఆ ఉద్యానవనం ఎక్కడ వాడిపోతుందోనని వనజాప్తుడు తన తీక్షణ కిరణాలవేడిని ఉపసంహరించాడు. నందనవనం ఇప్పుడు భోగయోగ్యంగా ఉన్నది.

సూర్యదేవుడు మేరుశిఖరాలు అధిరోహించి తన వేడికి స్వర్ణ శిఖరాలు ఎక్కడ కరిగి నీరవుతాయోనని తగినట్లు కిరణప్రసారం చేయసాగాడు. లోకబాంధవుడుకదా! ఆ ఆదిత్యమూర్తి అందరినీ ఆదరించుగాక!

"ఋగ్యజుస్సామపారగః"

 

౮౪. శ్లోకం

ధ్వాంతస్యైవాంతహేతుర్న భవతి మలినైకాత్మనః పాప్మనోఽపి
ప్రాక్పాదోపాంతభాజాం జనయతి న పరం పంకజానాం ప్రబోధమ్
కర్తా నిఃశ్రేయసానామపి తు న ఖలు యః కేవలం వాసరాణాం
సోఽవ్యాదేకోఽష్యమేచ్ఛాపిహితబహుబ్రహ్మద్విశ్వకార్యోఽర్యమా వః

పద్యం

ఎవడు మలిన తమోబృందమాత్రమెకాక
పాపసందోహమ్ము బారద్రోలు
ఎవడు పంకేరుహ నివహమాత్రమెకాక
శరణార్థులకు వికాసమ్ముకూర్చు
ఎవడు ప్రభాపూర్ణ దివసమాత్రమెకాక
ఘనులకు మోక్షమార్గమ్ము జూపు
ఎవడేకసత్కార మేకమాత్రమెకాక
అతిసంఖ్య విశ్వకార్యాలు సేయు

అతడు జగదేకమిత్రుడు అంశుమాలి
ఉన్నత గుణుండు నిత్యలోకోపకారి
వచ్చుచున్నాడు కన్నులు విచ్చిచూచి
నుతి యొనర్పుము సుమనో మనోహరముగ !

## ఫలశ్రుతి

అడుగో! శుభంకరుడైన సూర్యనారాయణమూర్తి ఉదయిస్తున్నాడు. అంశువులతో అందరినీ ఆశీర్వదిస్తున్నాడు.

సూర్యభగవానుడు తన కిరణ ప్రసారంచేత ప్రగాఢ తమోరాశుల్ని పారద్రోలి జ్ఞానం వెదజల్లుతున్నాడు. ఆ కార్యంతో పాటు ప్రజల పాపపంకిలాన్ని కడిగివేస్తున్నాడు.

పద్మినీవల్లభుడు జలజాలకు వికాసం చేకూర్చాడు. జీవకోటికి తమతమ కార్యకలాపాలు చేసికోటానికి అన్నివిధాల ఉపయోగపడటానికి కారణభూతుడైన కర్మసాక్షి మందహాసంచేస్తూ వస్తున్నాడు.

వేదత్రయీతనుడు సూర్యదేవుడు యోగీశ్వరులకు మోక్షద్వారాలు తెరుస్తాడు. సవితృస్వామి తన కార్యంచేత చరాచరాలకు ఎన్నో ఉపకారాలు కలిసివచ్చేలా చేస్తుంటాడు. విశ్వకల్యాణ కారకుడైన విభాకరస్వామి ప్రజల కామితములు నెరవేర్చుగాక!

★ ★

"ఏష బ్రహ్మాచ విష్ణుశ్చ శివ స్కంధః ప్రజాపతిః"

—ఆదిత్యహృదయం

## 85. శ్లోకం

లోటన్‌శోష్టావిచేష్ట శ్శ్రితశయనతలో నిస్సహీభూతదేహ
స్సందేహీ ప్రాణితవ్యేసపది దశదిశః ప్రేక్షమాణోఽంధకారమ్
నిఃశ్వాసాయాసవిష్టః పరమపరవశో జాయతేజీవలోక
శ్శోకేనేవాన్యలోకాభ్యుదయకృతిగతే యత్రసోఽర్కోవతాన్నః

## పద్యం

ఎవ్వాడు ఒకపూట ఇతరదేశములేగ
జనులు నిట్టూర్చి మంచమ్ము వట్టు
ఎవ్వాడు ఒకపూట ఇతరదేశములేగ
జీవులు మృతులట్లు చేష్టదక్కు
ఎవ్వాడు ఒకపూట ఇతరదేశములేగ
అంధకారము దిక్కు లలముకొనును
ఎవ్వాడు ఒకపూట ఇతరదేశములేగ
నిశిత పాషాణాలు సిరుకారు

అట్టి లోకబంధువు ప్రజ కాప్తసఖుడు
జగతి నేత్రమ్ము దినమణి సన్నుతుండు
ఉదయ మగుచుండె! బాబు! అభ్యుదయమొదవ
నుతి యొనర్పుము సుమనో మనోహరముగ !

## వ్యాఖ్య

అడుగో! ఆపద్బాంధవుడు ఆదిత్య సత్యమూర్తి వస్తున్నాడు. ఎంతో కాలం అయినట్లుయుంది. పోయిన ప్రాణం వచ్చినట్లుయుంది. ఆయన ఉంటేనే బ్రతుకు కదా!

పరోపకారార్థం పరంధాముడు పరదేశం పర్యటనకు వెళితే ఇక్కడ జీవలోకం శోకంలో మునిగిపోతుంది. ఎవని ముఖానా వెలుగు అనేదే ఉండదు. ప్రతివాడు మృత్పిండంవలె చేష్టావిహీనమై కనిపిస్తాడు మంచంపడతాడు. స్పృహ కోల్పోతాడు. అసలు జీవించి ఉన్నారా! లేదా! అదే సందేహానికి గురి అవుతారు.

పది దిక్కుల అంధకారం క్రమ్ముకొంటుంది. పండుకొన్న వాళ్ళు పండుకొన్నట్టే ఉంటారు. పరాధీనులౌతారు. లోకబాంధవుడు లేకపోతే లోకం శోకంలో మునిగిపోతుంది. అంధకారంలో కొట్టు మిట్టాడుకొని నిట్టూర్పులు నిగుడుస్తుంది.

ఓ కమలబాంధవా! లోకబాంధవా! ప్రజలకు ప్రగతి ప్రసాదించు దేవా!

★ ★

"గభస్తిమతే నమః"

## 86. శ్లోకం

క్రామన్ లోలోపి లోకాం స్తదుపకృతికృతావస్థితః స్థైర్యకోటిం
తృష్ణాంధాం దృష్టిం విశిష్టాం విదధదపి కరోత్యంతరత్యంతమంధామ్
యస్తాపస్యాపి హేతుర్భవతి నియమినామేకనిర్వాణదాయీ
భూయాత్స ప్రాగవస్థాధికతరపరిణామోదయో ఒర్కః శ్రియై నః

### పద్యం

చకచకానడకలో చంచలుండై నేగు
జగదుపకృతిలో అచంచలుండు
జనబాహ్యదృష్టిని సంకోచమొనరించు
జ్ఞానదృష్టి ప్రకాశమ్ముసేయు
ఘనసమితికి తాపకారణుడై యుండు
పరివ్రాట్టులకు మోక్షకారణుడగు
మధ్యాహ్నమున పెనుమంటలు నెగజిమ్ము
సంధ్యల చలిమంట సరణియుండు

పూర్వపూర్వముకంటెను పోనుపోను
అత్యధికుడై ప్రకాశించు అంబరమున
అట్టి ఆదిత్యదేవుడు అదుగో! చూడు
నుతి యొనర్పుము సుమనో మనోహరముగ !

## వ్యాఖ్య

అదుగో! అహస్కరుడు ఆతృతతో అరుదెంచాడు. లోకాలకన్నిటికి వెలుగు చూపాలికదా! అదీ ఆరాటం.

లోకంలో ఎక్కడా క్షణం నిలువక చంచలుడై ఒకటే పరుగు తీస్తున్నాడు. ఆయన నడకే అంత. ఆయన నడకలో చంచలుడుగా కనిపించినా లోకాలకు ఉపకారం చేయటంలో అచంచలుడు. అందువల్ల లోకులు ప్రభాకరుణ్ణి చంచలుడనీ అచంచలుడనీ అంటారు.

మార్తాండుడి తేజస్సు మహోగ్రంగా ఉంటుంది. మానవులు కన్నులెత్తి వీక్షించటానికి శక్యంకాదు. మానవులను ఎదురుగా చూడనివ్వడేకాని అన్నిటినీ కనిపింపజేసేది ఆయనే. అంతరంగంలో చూపును ఆయన ప్రసాదిస్తాడు. అందుకని ఆయన్ని లోకులు చూపు చెరుపువాడు అనీ చూపు ఇచ్చువాడు అనీ అంటారు. సూర్యుడు సామాన్యులకు తాపకారకుడు. యోగులకు నిర్వాణం అందిస్తూ ఆత్యంతిక సుఖకారకుడు.

పూర్వం పూర్వస్థితిరంటే రానురాను అధికాధిక పరిణతి గలవాడై సవితృదేవుడు సుఖాన్ని అనుగ్రహిస్తాడు.

★ ★

"ఉగ్రాయ నమః"

## 87. శ్లోకం

వ్యాపన్నర్తుర్నకాలో వ్యభిచరతి ఫలం నౌషధీర్వృష్టిరిష్టా
నేష్టైస్తృప్యంతిదేవా నహి వహతి మరున్నిర్మలాభానిభాని
ఆశాశ్యాంతానభిందత్యవధిముదధయో బిభ్రతిక్ష్మాభృతఃక్ష్మాం
యస్మింస్త్రైలోక్యమేవం నచలతి తపతి స్తాత్స సూర్యః శ్రియై వః

పద్యం

ఎవడు సదా ప్రకాశించుటచే సర్వ
    కాలాల ఋతువులు క్రమతనుండు
ఎవడు సదా ప్రకాశించుటచే ఎప్డు
    సమయానుకూల వర్షములు కురియు
ఎవడు సదా ప్రకాశించుటచే సక
    లాధ్వరమ్ముల సురల్ హర్షమందు
ఎవడు సదా ప్రకాశించుటచే మహా
    వాయుదేవుండు వీవనలు విసరు

చుక్కలు వెలుంగు, కడలి ఉబ్బెక్కకుండు
గిరిధర ధరించు, జగములు పరవశించు
అట్టి రవిమూర్తి దయచేసె అడుగొ చూడు
నుతి యొనర్పుము సుమనో మనోహరముగ !

వ్యాఖ్య

అడుగో! కర్మసాక్షి సాక్షాత్కరించాడు. అందరినీ అనుగ్రహించాడు. కర్మసాక్షి రాకపోతే కాలచక్రమే ఆగిపోతుంది. ఇది సుదినం అయింది.

ఆ స్వామి కనిపించనిదినం దుర్దినంకదా! కమలబాంధవుడు ప్రకాశిస్తేనే ఋతుధర్మం సరిగా సాగుతుంది. ఓషధులు ఫలవంతమవుతాయి.

వేయిచేతులు లేనివల్లనే హర్షంగా వర్షాలు కురుస్తాయి. సవితృదేవుడివల్లనే యాగాలు యజ్ఞాలు సక్రమంగా సాగుతాయి. యజ్ఞాలవల్లనే దేవతాసమూహం సంతోషిస్తుంది. తృప్తితో వరాలు ప్రసాదిస్తుంది. విశ్వకల్యాణం జరుగుతుంది.

వనజబాంధవుడివల్లనే వాయువులు క్రమంగా వీస్తున్నాయి. ఏ వాయువులు ఎప్పుడు వీచాలో వివస్వతుడికే ఎరుక. సూర్యుడివల్లనే చుక్కలు మెరుస్తున్నాయి. లేకపోతే అంతా చీకటే.

సప్తాశ్వుడివల్ల సాగరాలు మేరమీరక కట్టుబడి ఉన్నాయి. భువనబంధువువల్లనే భూధరాలు భూమిని భరిస్తున్నాయి. మూడు లోకాలు నియమబద్ధంగా నిర్మలంగా నిలకడగా ప్రకాశిస్తున్నాయి. జీవకోటి ఆ స్వామివల్లనే జీవిస్తున్నది. ఆ ఆదిత్యమూర్తి అందరికీ అధిక సంపదలిడుగాక !

 

''దేవా ఆదిత్యాయేనప్త''

—తైత్తరీయం

88. శ్లోకం

కైలాసే కృత్తివాసా విహరతి విరహత్రాసదేహార్ధకాంతః
క్రాంతశ్చేతే మహాహోపధిజలధి వినా ఛద్మనాపద్మనాభః
యోగోద్యోగైకతానో గమయతి సకలం వాసరం స్వం స్వయంభూ
ర్భూరిత్రైలోక్యచింతాభృతి భువనవిభా యత్ర భాస్వాన్సనోఽవ్యాత్

పద్యం

విరహభయమ్ముచే విశ్వేశ్వరుడు అద్రి
అర్ధనారీశుడై ఆడుచుండ
శ్రీవిష్ణు వంభోధి శేషతల్పముపైన
దిగులు లేకుండ నిద్రించుచుండ
బ్రహ్మ యోగసమాధి పరమైకదృష్టితో
కల్పములు చిటికలో గడుపుచుండ
పవనుండు నిరతమ్ము ప్రాణవాయువృత్తిచే
విశ్వంపు పదము సేవించుచుండ

వీరి కెటువంటి హాని చేకూరకుండ
లోకవాసుల క్షేమమున్ చూచుకొనుచు
వచ్చుచున్నాడు పద్మినీవల్లభుండు
నుతి యొనర్పుము సుమనో మనోహరముగ !

వ్యాఖ్య

అడుగో! భువనబాంధవుడు వస్తున్నాడు. ముల్లోకాల యోగ క్షేమాలు చూస్తున్నాడు. అన్ని బాధ్యతలు తాను వహిస్తున్నాడుకదా అని త్రిమూర్తులు స్వేచ్ఛగా ఉన్నారు.

గజచర్మాంబరధారి విరహబాధ భరించలేక విశాలాక్షి అన్నపూర్ణను అర్ధదేహంలో ఇముడ్చుకొని కైలాసంలో హాయిగా ఉన్నాడు. ఆదివిష్ణువు క్షీరసాగరంపైన ఆదిశేషుణ్ణి తల్పంగా చేసు కొని, లక్ష్మీదేవి పాదసంవాహన జరుపుతుండగా యోగనిద్రను పూనాడు.

భూభారం పనులన్నీ అరవిందబంధువు చూస్తున్నాడుకదా అని అరవిందసూతి బ్రహ్మదేవుడు యోగదీక్షలో ఏకాగ్రచిత్తంతో కూర్చున్నాడు. ఇలా అన్నీ నిర్వహించే త్రిమూర్తులు విశ్రాంతి తీసు కొంటున్నారు. ఆ పనులన్నీ ప్రభాకరస్వామి నిర్వహిస్తున్నాడు. అలాంటి ఆదిత్యమూర్తి వస్తున్నాడు.

ప్రభాకరుడు ప్రజలను కాపాడుగాత!

★ ★

"సౌభ్యమూర్తయే నమః"

## 89. శ్లోకం

ఏతద్యన్మండలం ఖే తపతి దినకృతస్తా ఋచో ఽర్చీంషి యాని
ద్యోతంతే తాని సామాన్యయమపి పురుషో మండలేఽణుర్యజూంషి
ఏవం యం వేద వేదత్రితయమయమయం వేదవేదీ సమగ్రో
వర్గస్స్వర్గాపవర్గోపకృతి రవికృతిస్సోఽస్తు సూర్యః శ్రియై నః

### పద్యం

"భవదీయ మహనీయ పరమప్రభాపూర్ణ
విపులమండలము ఋగ్వేదమయ్యె
భవదీయ మహనీయ పరమప్రభాపూర్ణ
విజయధామము సామవేదమయ్యె
భవదీయ మహనీయ పరమప్రభాపూర్ణ
వినుతాత్మరుచి యజుర్వేదమయ్యె
భవదీయ మహనీయ పరమప్రభాపూర్ణ
ధర్మమ్ము సర్వ వేదమ్ములయ్యె

ఓ త్రయీతనూ! వేదరసోత్తమాంగ
స్వర్గమోక్షప్రదా!" యంచు సన్నుతించి
ఋషులు ప్రణమిల్లుచుండె వీక్షింపు మదిగో
సుదతి యొనర్పను సుమనో మనోహరముగ!

వ్యాఖ్య

అదుగో! వేదత్రయీ దేహుడు దయచేస్తున్నాడు. "సూర్య నారాయణా! వేదపారాయణా!" అని బ్రాహ్మణోత్తములు అర్ఘ్య పాద్యాలు సమర్పిస్తున్నారు.

ఆ ప్రకాశించే ఆదిత్యమండలంలో మహామహిమాన్విత కాంతులు వేదఋక్కులు. త్రిసంధ్యాసమయాలలో విరాజిల్లే ప్రభలు సామ వేద సంహితలు. ఆ మండలంలో మనోహరంగా ప్రసరించే అణురూపుడగు అర్యముడు అనంతుడు. ఆయన ఆత్మస్వరూపుడు. ఆత్మయే యజుర్వేదం. ఆ సమగ్రమూర్తిని ఎవరూ గుర్తింపలేరు.

ఇలా విహరించే స్వామివేదత్రయీతనుడు అని వేదవేత్తలు వేయివిధాల వినుతిస్తారు. ఆయన వికృతి ఎరుగనివాడు. సుకృతి అంటే ఆతడే. విమలచరిత్రుడు. అతి పవిత్రుడు. ఆయన ద్వాద శాత్ముడు. మోక్షప్రదుడు.

ఆ స్వామి సకల సంపదాయురారోగ్య భాగ్యాలు ప్రసా దిస్తాడు.

★ ★

"ఋగ్యజుస్సామ పారగాయ నమః"

## 90. శ్లోకం

నాకౌకః పత్యనీకక్షతిపటుమహసాం వాసవాగ్రేసరాణాం
సర్వేషాం సాధుపాణాం జగదిదమదితేరాత్మజత్వే సమేఽపి
యేనాదిత్యాభిధానం నిరతిశయగుణైరాత్మని న్యస్తమస్తు
స్తుత్యస్త్రైలోక్యవంద్యైస్త్రిదశమునిగణైస్సోఽస్తుసూర్యః శ్రియై వః

### పద్యం

తేజోవిరాజిత దేవతామూర్ధన్యు
రిపు సమూహము సంహరించుటందు
లోకవాసులకింత శోకమ్ము లేకుండ
ఎల్లర నెపుడు రక్షించుటందు
తనకును శక్రాదిదైవతమ్ములకున్న
మహితమౌ మాతృ సమత్వమందు
త్యాగసేవాభావ తత్త్వసాహిత్యాది
గణిత సర్వోత్కృష్ట గుణములందు

సత్యనిష్ఠాగరిష్ఠు డాదిత్యవిభుడు
అన్న పదముకు సార్థకమైనవాడు
దినకరుడు ప్రభాకరు డరుదెంచె బాబు
నుతి యొనర్పుము సుమనో మనోహరముగ !

## వ్యాఖ్య

అడుగో! ఆదిత్యచక్రవర్తి విజయం చేస్తున్నాడు. అంతటా ఆహ్లాదం వెల్లివిరిసింది.

అదితి కడుపు పండింది. అమ్మ చరితార్థతనొందింది. అదితికి అనేకమంది సంతానం. అందరూ అసహాయశూరులే. కొందరు దేవ శాత్రవులైన రాక్షసకోటిని హతమార్చేవారు. మరికొందరు మహా వీరాధివీరులు, జగద్రక్షణభారం వహించినవారు. ఇంకా కొందరు దేవతాప్రభువులు ఇంద్రాదులు. అందరూ గొప్పవారే.

కానీ అందరిలో సర్వసుగుణాలను పుణికిపుచ్చుకొన్నవాడు పూషుడే. అదితి కొడుకని ఆయనను "ఆదిత్యుడు" అన్నారు. ఆయన అందరికీ ఆరాధనీయుడు. త్రైలోక్యవంద్యుడని దేవతలచేత యోగీశ్వరులచేత ప్రభువులచేత ప్రజలచేత పద్యాలచేత స్తుతింపబడు తున్నాడు. ఆయనకు వేలాది నామాలున్నా ఆదిత్యుడనే సార్థక నామం ఆయనకే దక్కింది.

★ ★

"అదితేః పుత్రాయ నమః"

## 91. శ్లోకం

భూమిం ధామ్నోఽభివృష్ట్యా జగతిజలమయీం పావనీం సంస్మృతావ
ప్యాగ్నేయీం దాహశక్త్యాముహురపి యజమానాత్మికాం ప్రార్థితార్థైః
లీనామాకాశ ఏవామృతకరఘటితాం ధ్వాంతపక్షస్య పర్వ
ణ్యేవం సూర్యోఽష్టభేదాం భవఇవ భవతఃపాతు బిభ్రత్స్వమూర్తిమ్

పద్యం

కాంత్యాశ్రయముగుట కాశ్యపి తనువును
ఉర్వివర్షించుట ఉదక తనువు
భక్తుల బ్రోచుటన్ పావని తనువును
దాహకశక్తితో దహను తనువు
అధినాథుడగుటచే యజమాన తనువును
ఆకసంబునయుంట అభ్ర తనువు
కృష్ణపర్వమునుంట హిమకరు తనువును
సత్యదీధితుల ఆదిత్య తనువు

కలిగి అష్టతనువులతో కలిసిపోయి
శంకరుండంతవాడయి సవితృవిభుడు
వచ్చుచున్నాడు పుత్రకా ! త్వరిత గతుల
నుతి యొనర్పుము సుమనో మనోహరముగ !

వ్యాఖ్య

అడుగో! అర్యముడు అష్టతనూవిరాజితుడైన విశ్వేశ్వరుడి వలె ప్రకాశిస్తున్నాడు. ఎంత తేజోమయస్వరూపం! ఆతడు అచ్చంగా పరంధాముడే సుమా!

ఆదిత్యుడు కాంతికి ఆశ్రయభూతుడు. భువనబాంధవుడు. పూజ్యుడు. భూమిమయ తనూవిరాజమానుడు. అహస్కరుడు. వర్ష ప్రదాత. భూమికి వర్షమూ హర్షమూ ప్రసాదించే ఆయన జలజబాంధవుడు. జలమయతనూశోభితుడు.

చిత్రభానుడు పావన చరిత్రుడు. అందుచే ఆయన పవనమయ తనూసుందరుడు. అంశుమాలి దాహక తేజోదీప్తుడు. అగ్నిమయతనూమంగళుడు. సహస్రాంశువు ఆకాశాంతరవర్తి. మహాకాశం దహరాకాశం హృదయాకాశం ఆయన నివాసస్థానాలు. అందువలన ఆయన ఆకాశమయ తనూశివంకరుడు. గ్రహపతి ప్రార్థితార్థ ప్రాప్తి గలవాడు. యజ్ఞయాగ నిర్వాహకుడు. కనుక యజమానతనూతత్త్వజ్ఞ శిరోమణి. ఆ ఖద్యోతనుడు అమావాస్యనాడు చంద్రుడితో కలిసి సంచరిస్తాడు. కాబట్టి అరుణుడు చంద్రమయ తనుప్రభాకరుడు. తరణి తనదైన ప్రత్యేకమైన ప్రభాపూర్ణతనువుదాల్చి ఉంటాడు. పూషణుడు కదా!

ఇలా ఆదిత్యుడు ఆదిశంకరుడివలె అష్టతనూవంద్యుడై అలరారుతున్నాడు.

 

## 92. శ్లోకం

ప్రాక్కాలోన్నిద్ర పద్మాకర పరిమిళనావిర్భవత్పాదశోభః
భక్త్యాత్యక్తోరుభేదోద్ధతి దివి వినతాసూనునా నీయమానః
సప్తాశ్వాప్తాపరాంతాన్యధికమధరయన్నో జగంతిస్తుతోఒలం
దేవైర్దేవస్సపాయాదపర ఇవ మురారాతిరహ్నాంపతిర్నః

### పద్యం

ప్రాక్కాల సుందర పద్మకరార్చిత
సుకుమార పాదాలసుఖములంది
త్యక్తోరు బాధల తనరారి సేవించు
వినతాత్మజునినుండి వినతులంది
అశ్వాన సప్తకములు అపరాంతములుజేర్చి
సురవరేణ్యులచేత స్తుతులనంది
ప్రీతిమై వెంటప శ్రీమహావిష్ణువో
అనునట్లు దిక్కుల వ్యాప్తిజెంది

దేవ మానవ జీవ సంతృప్తిమెరసి
అరుణదీపిత దివ్యపీతాంబరుండు
వచ్చుచున్నాడు ప్రతకా! త్వరిత గతుల
నుతి యొనర్పుము సుమనో మనోహరముగ !

వ్యాఖ్య

అడుగో! ఆదిత్యమూర్తి. అచ్చంగా ఆదినారాయణ మూర్తిలా ఉన్నాడు. ఆయన సూర్యనారాయణుడు కదా!

ప్రాక్కాలంలో ప్రభాకరుడు పద్మాక్షునివలె ఉన్నాడు. పద్మ హస్తపద్మాలుతాకగా శ్రీవిష్ణువు పాదపద్మాలు మరీ ప్రభలీను తున్నాయి. శ్రీహరి చిరునవ్వుతో శోభిల్లుతున్నాడు.

అలానే సూర్యనారాయణుడు కూడా పూర్వాహ్ణంలో విప్పారిన పద్మాలతో ప్రకాశించే పాదకిరణాల శోభతో ప్రకాశిస్తు న్నాడు. విష్ణుసేవకుడైన గరుత్మంతుడు సూర్యసారథి ఇరువురూ వినతానూనులే సేవిస్తున్నారు.. ఊరువులబాధను పరిగణించటంలేదు గరుడుడు. అరుణుడికి అసలు ఊరువులులేవనే బాధేలేదు. ఇరువురు స్వామిసేవాపరాయణులే గరుడుడు వాహనమైనాడు. అనూరుడురథం తోలుతున్నాడు. సప్తాశ్వాలు అనూరుడు తోలుతుండగా సప్తలోకాలు గరుడుడు సంచరిస్తున్నాడు.

కనుక శ్రీమహావిష్ణువు శ్రీసూర్యనారాయణుడు సమానులే సుమా!

★ ★

"పూజయస్వ వివస్వతం"

## 93. శ్లోకం

యః స్రష్టాపాం పురస్తాదచలవరసమభ్యున్నతేర్హేతురేకో
లోకానాంయస్త్రయాణాంస్థితఉపరిపరం దుర్విలంఘ్యేనధామ్నా
సద్యస్సిద్ధైఃప్రసన్నద్యుతిశుభచతురాశాముఖః స్తాద్విభక్తో
ద్వేధా వేధా ఇవావిష్కృతకమలరుచిస్సోఽర్చిషామాకరో వః

### పద్యం

అంభస్సు ఆత్మలో ఆప్తుడై వెలుగొంది
సృష్టికర్తయి అంతవృద్ధిబొంది
పర్వతాభ్యున్నతి ఫలకారణుండయి
ఉపకారశీలత ఉర్విమెరసి
దుర్విలంఘ్యామోఘ దుర్లభధాముడై
సకలలోకోన్నత స్థానమంది
తులలేని శోభాచతుర్దిశాముఖముల
ఆవిష్కృతాంభోజహ్లాదమంది

తాతయంతటివాడయి ఖ్యాతిపడసి
కీర్తికిరణాలు దిశల వెల్గించి మించి
ద్వాదశాత్ముడు సూర్యుడు వచ్చెనోయి !
నుతి యొనర్పుము సుమనోమనోహరముగ !

## వ్యాఖ్య

అడుగో! ఆదిత్యుడు ఉదయిస్తున్నాడు. ఆయన అచ్చంగా అపర బ్రహ్మలాగనే ఉన్నాడే. అన్ని గుణాలు ఇరువురికీ సమానమే.

ఇరువురు జలస్రష్టలు. ఇరువురు అచల అభ్యున్నత్యైక కారణులు. ఐతే కుల పర్వత అభ్యున్నతికి హేతుభూతుడు బ్రహ్మ దేవుడు. ఉదయ పర్వత అభ్యున్నతికి ఏకైక కారణుడు సూర్య దేవుడు. ఇరువురు దుర్విలంఘ్యధామముచే త్రిలోకాలలో విశిష్ట ఉన్నత స్థానం పొందినారు. ధామము అంటే స్థానం గృహం కాంతి అని. సూర్యుడు కాంతికి నెలవై తిరస్కరింపరాని తేజస్సుచే విశిష్టమైన స్థానమైనాడు. బ్రహ్మదేవుడు గొప్పస్థానంలో ఇతరులకు అలభ్యంగా విశిష్టంగా కడు విరాజిల్లుతున్నాడు. అది దుర్విలంఘ్యం.

ఇరువురు నిర్మల కాంతిచేత ప్రకాశిస్తున్న చతురాశా ముఖాలు గలవారు. సూర్యుడు నాలుగుదిక్కులు నాలుగు ముఖాలుగా ప్రకాశిస్తున్నాడు. బ్రహ్మదేవుడు నాలుగు ముఖాలతో విరాజిల్లు తున్నాడు.

ఇరువురు ఆవిష్కృత కమలరుచులు గలవారు. పద్మకాంతి గల బ్రహ్మ కమలంనుండి జన్మించాడు. సూర్యుడు కమల బాంధవుడై కమల కాంతులను వెలయింపజేస్తాడు. అలా బ్రహ్మకు సూర్యునికి అనేక గుణాలలో సమానత్వం ఉంది. అట్టి అరుణుడు అందరినీ రక్షించుగాక !

 

"జ్యోతిర్గణానాం పతయే నమః"

94. శ్లోకం

సాద్రిద్యూర్వీనదీశా దిశతి దశదిశో దర్శయన్ ప్రాగ్దృశో య
స్సాదృశ్యం దృశ్యతే నో సదశశతదృశిత్రైదశేయస్యదేశే
దీప్తాంశుర్వస్స దిశ్యాదశివయుగదశాదర్శితద్వాదశాత్మా
శాస్త్రశ్శాన్ శర్మ యస్యాశయవిధతిశయాద్ధందశూకాశనాద్యః

పద్యం

ధాత్ర్యబ్ధిశైలాది దశదిశావళి వెలి
గించి కన్నులు తెరిపించువాడు
అఖిల లోకాధీశులౌ పాకశాసనా
ద్యమరుల సాటిలేనట్టివాడు
హయహృదయమెరింగి స్యందనంబును ద్రోలు
అరుణుడు సారథి యైనవాడు
ప్రళయవేళల తన పంద్రెండుమూర్తులన్
ఇద్ధదీప్తుల ప్రకటించువాడు

ఆదినారాయణుండు అహస్కరుండు
వేదపారాయణుండు ప్రచోదనుండు
సూర్యదేవుండు వచ్చెను శుభము బాబు
నుతి యొనర్పుము సుమనో మనోహరముగ!

## వ్యాఖ్య

అడుగో! అంశుమాలి రథం మీద వస్తున్నాడు. ద్వాదశా త్ముడు వైభవంగా దయచేస్తున్నాడు.

ఏమి ప్రకాశం! ఏమి తేజస్సు! స్వామి వస్తుంటే పర్వతాలు బంగారుకొండలై దండిగా వెలుగుతుంటాయి. వసుంధర తనసంపదలన్నీ స్వామి పాదాలముందు వారుపోసి ప్రణమిల్లుతున్నది. సప్తసముద్రాలు స్వామికి అర్ఘ్యపాద్యాలిచ్చి సాష్టాంగ నమస్కారాలు చేస్తున్నాయి. దశదిశాలతాంగులు జ్యోతులు వెలిగించి హారతులు యిస్తున్నారు. సూర్య సార్వభౌముని వైభవం ముందు దేవేంద్రవైభవం సాదృశ్యమే లేదు.

ఆ స్వామి సప్తాశ్వాలు అనూరుడి సారథ్యంలో ఎంత వేగంగా నడుస్తాయి. అనూరుడంటే విష్ణువాహనభూతుడైన గరుడా శ్వారులవారి అగ్రజుడు కదా! ఆదిత్యుడు ద్వాదశాత్ముడై ప్రళయ కాలంలో అవసరమైన తన పంద్రెండు మూర్తులను ప్రకాశింపజేస్తాడు.

ఆ సవితృస్వామి అందరినీ ఆదుకొంటూ ప్రజలకు సౌఖ్యా లను ప్రసాదించుగాక!

★ ★

"ద్వాదశాత్మనే నమః"

95. శ్లోకం

తీర్థాని వ్యర్థకాని హ్రదనదసరసీ నిర్ఝరాంభోజినీనాం
నోదన్వంతోనుదంతి ప్రతిభయమశుభం శ్వభ్రపాతాను బంధి
ఆపో నాశాపగాయా అపి కలుషముషో మజ్జతాం నైపయత్ర
త్రాతుం యాతేఽన్యలోకాన్స దిశతుదివసస్త్యైక హేతుర్హితం వః

పద్యం

పనికల్గి ఎవ్వాడు పరికింపకుండిన
తీర్థరాజమ్ములు వ్యర్థమగును
పనికల్గి ఎవ్వాడు పరికింపకుండిన
పాథోధు లఘములు బాపలేవు
పనికల్గి ఎవ్వాడు పరికింపకుండిన
గంట లెన్నైన పగళ్ళుకావు
పనికల్గి ఎవ్వాడు పరికింపకుండిన
పైరుల మొగములు పాలిపోవు

ప్రొద్దులేకున్న జనులకు పెద్దనిదురె
దినము దర్శింపకున్న దుర్దినమె - కాన
వచ్చుచున్నాడు తండ్రి ! దివాకరుండు
నుతి యొనర్పుము సుమనో మనోహరముగ !

## వాఖ్య

అడుగో! పూర్వపర్వతంపై పుణ్యమూర్తి పూషణుడు ఉదయిస్తున్నాడు. లోకాలకు శోకాల బాధ తొలగింది. అజ్ఞానం అంతరించింది.

ఈ మహానుభావుడు రాకపోతే అంతా అంధకారబంధురమే కదా! జలాశయాలు నదీనదాలు సరోవరాలు సెలయేళ్ళు నీళ్ళుండి కూడా నిష్ప్రయోజనాలే. పుణ్యతీర్థాలని పేరుపెట్టుకున్నాయే కాని ఆ పూషణ పుణ్యపురుషుడు తారకపోతే అవిపెట్టుకొన్న పేర్లన్నీ పెట్టుపేరులే. రవి ప్రకాశించకపోతే అవి పుణ్యం ఈయని తీర్థాలేకదా!

నరకఅగ్నిగర్తంలో త్రోయబడు నరజాతి పాపాగ్నులను సప్త సాగరాలు సైతం బాపి ఆర్పలేవుకదా! దినమును సుదినంచేయాలంటే సూర్యదేవుడు రావలసిందే. వచ్చి స్ప్రశించవలసిందే. అపుడే వారు పవిత్రులౌతారు. అలా సుదినం కలుగజేయుటాలిన ఏకైక కారణభూతుడు భువనబాంధవుడు. ఆ ప్రభాకరుడు ప్రజలకు పుణ్యం ప్రసాదించి పాపం పరిహారం చేస్తాడు.

సూర్యాధిష్ఠితం అయితేనే సమస్తతీర్థాలు సప్తసాగరాలు ఆకాశగంగ సమర్థాలు అవుతాయి.

★ ★

"అపాంపతయే నమః"

## 96. శ్లోకం

ఏతత్పాతాళపంకప్లుతమివ తమసాచైక ముద్గాఢమాసీ
దప్రజ్ఞాత ప్రతర్క్యం నిరవగతి తథాలక్షణం సుప్తమంతః
యాదృక్ సృష్టేః పురస్తాన్నిశినిశి నిఖిలంజాయతే తాదృగేవ
త్రైలోక్యం యద్వియోగాదవతు రవిరసౌ సర్గతుల్యోదయో వః

పద్యం

కమలబాంధవ! నీవు క్షణము రాకున్నచో
పుడమిపై చీకట్లు బురదపడును
లోకబంధూ! నిన్నివాలోకింపకున్నచో
తప్పక నిదుర పెద్దమ్మపట్టు
ద్వాదశాత్మా! నీవు దయచేయకున్నచో
రాత్రించరాళి పరాక్రమించు
దినమణీ! నీవింత కనుపింపకున్నచో
సృష్టి పూర్వంబున్న స్థితిని పొందు

అంచు సంయమీంద్రులు ప్రణవాంజలు లిడి
నతులు గావించుచుండ ఆనందమంది
వేయిచేతులసామి విచ్చేయుచుండె
నుతి యొనర్పుము సుమనో మనోహరముగ!

వ్యాఖ్య

అడుగో! అరుణకరుణమూర్తి అరుదెంచాడు. ప్రజల బ్రతుకులు ఫలించాయి.

అర్యముడు రాకపోతే ఎంత అంధకారం! త్రైలోక్యం తిమిరావృతమై భయావహమౌతుంది. ప్రభాకరుడు లేకపోతే ముల్లో కాలు పాతాళపుటడుసులో బడి మహా తమస్సులో మునిగి తెలివిచేటలు కోల్పోతాయి. నిద్రాముద్రితమై కన్నులు మూతలుపడి పెద్ద మొద్దు తనంతో లోకాలు స్పృహకోల్పోతాయి.

అనూహ్యము అగోచరమూ సృష్టికి పూర్వంనాటి స్తబ్ధత్వమూ కలిగిఉంటాయి. నిజంగా ఈ సృష్టి పూర్వస్థితికి చేరుకొంటుందా! అనిపిస్తుంది.

ఈ సూర్యభగవానుడు సృష్టితోబాటు అవతరించి అంధకార స్థితి రూపుమాపాడు. జగద్బంధువు దయాసింధువు దయజూచాడు. దయచేశాడు.

ఇక శుభవృష్టి వర్షిస్తుంది. పుణ్యపుష్పాలు పూస్తాయి. ఈ ఉదయం అందరికీ అభ్యుదయం అగుగాక!

★ ★

"విశ్వ మాభాసి రోచనం"

—సౌరపాఠం

## 97. శ్లోకం

ద్వీపే ద్వీపేఽస్తాచలోఽస్మిన్ భవతిఖలుస ఏవాపరత్రోదయాద్రి
ర్యామిన్యుజ్జ్వలేందుద్యుతిరిహ దివసోఽన్యత్ర దీప్తాతపస్సః
యద్వశ్యా దేశకాలావితి నియమయుతో నోతు యం దేశకాలా
నవ్యాత్స స్వప్రభుత్వాద్ధితభువనహితో హేతురహ్నామినో వః

### పద్యం

ఏదానొ ఒకచోట ఉదయాద్రి - మరొకచో
ఒడిదె అందాల అస్తాద్రియగును
ఏదానొ ఒకసారి ఇరులరేయల్లదె
వేరొక్కతావున వెన్నెల నిసి
ఏదానొ పగలాయి కింతకారణమదె
మరొకచో ఎండకు కారణమ్ము
ఏదానొ దినమున కేకైక కారణం
ఒకడె లోకాధిపత్యము వహించు

దేశకాలాలు దేని అధీనమగునొ
అవి అధీనమ్ము దేనికికాదొ ఎపుడు
అది ప్రభాకరబింబమ్ము - అరుగుదెంచె
నుతి యొనర్పుడు సుమనో మనోహరముగ !

## వ్యాఖ్య

అదుగో! సర్వసమున్నతుడు సర్వాధీశుడు సవిత్రుదేవుడు వస్తున్నాడు. సప్తాశ్వరథంమీద దయచేస్తున్నాడు. సర్వలోకాలూ ఆయనవే! సర్వతేజస్వరూపాలు ఆయనవే.

ఆయనకు అస్తాద్రీ, ఉదయాద్రీ సమానమే. చూచే ప్రేక్షకులకు మాత్రమే వేరు ప్రజలకు దేశాలు వేరు. స్వామి ఒక్కొక్కరికి ఒక్కొకవిధంగా కనిపిస్తాడు. కమలాలకు తన కాంతుడు వలెనే సాక్షాత్కరిస్తాడు. జగత్తులో అందరికీ ఆప్తబంధువులాగా సహాయపడతాడు. ద్వీపాలు దేశాలు వేరుకాని సూర్యుడొక్కడే.

ఒక ద్వీపంలో స్వామి వెలుగు మంచు పెందఅప్పుతుంది. అదే వెలుగు మరో ద్వీపంలో పండువెన్నెల కాస్తుంది. అన్ని వెలుగులు ఆయనవే. ఇలా దేశకాలాలకు ఆయన అధిపతి. ఆయన ఒక్కడే అన్ని దేశాలకు ద్వీపాలకు అన్ని లోకాలకు ఆధారభూతుడు.

దేశకాలాలు ఆయనకు హద్దులు పెట్టలేవు. ఆయన అంతర్యామి. ఆదిత్యుడు. నిత్యసత్యవ్రతుడు. సుదినాలు సుందరంగా ప్రకాశించటానికి ఆదిత్యుడే కారణభూతుడు. అట్టివాడు జగన్మిత్రుడు వస్తున్నాడు. శుభమండలం తెస్తున్నాడు.

★ ★

"ఒక సూర్యుండు సమస్తజీవులకు
తానొక్కొక్కడై తోచు..."

98. శ్లోకం

వ్యగ్రైరగ్ర్యగ్రహోడుగ్రసనగురుభరైర్నో సమగ్రైరుదగ్రైః
ప్రత్యగ్రై రీషదుగ్రై రుదయగిరిగతో గోగణైర్గౌరవంగామ్
ఉద్ధాధార్చిర్చిలీనామరనగరనగగ్రావగర్భామివాహ్నో
మగ్రేమోఽగ్రేవిధత్తేగ్లపయతు గహానం సగ్రహాగ్రామణీ ర్వః

పద్యం

ఉదయశైలమున అభ్యుదయమ్ము జెందుచు
ఏది వేగము ప్రసరించుచుండె
ప్రాచీన దిశనున్న రజనీశగ్రహములన్
ఏది మెల్లగ కబళించుచుండె
అసమగ్రమైనది అతులసంపూర్ణమై
ఏది దిక్కులను పూరించుచుండె
నులివెచ్చనై యున్న నేలతల్లి పదాల
ఏది తెన్నగ ప్రణమిల్లుచుండె

ఆ మయూఖచయము పరివ్యాప్తమయ్యె
మేరుపర్వత చారు కిమ్మీరకాంతి
చిత్రభానుడు పుత్ర ! విచ్చేసినాడు
నుతి యొనర్పుము సుమనో మనోహరముగ !

వ్యాప్తి

అడుగో! సహస్రకిరణుడు సత్వరం వస్తున్నాడు. సూర్య ప్రభలు సర్వప్రదేశాలు వ్యాపిస్తున్నాయి. ఏమి ద్యుతికరాలు! వరాల వన్నెలు విరబోస్తున్నాయి.

ఉదయపర్వతంమీద అభ్యుదయకరాలు కోకొల్లలుగా ప్రస రిస్తున్నాయి. ఆ కిరణాలు ప్రాచీనదిశలోని గ్రహాలను నక్షత్రాలను చంద్రుణ్ణి అంధకారాసురుల్ని మింగేస్తున్నాయి. మొదట అసంపూ ర్ణంగా దిశాంగణం మాత్రమున్న కిరణాలు క్రమ క్రమంగా సంపూర్ణ వ్యోమాన్ని ఆక్రమించి ప్రకాశిస్తున్నాయి.

ఆ పూర్ణజ్యోతులు సంపూర్ణాలు. స్వయంప్రకాశాలు. అవి తగినంత ఉష్ణంకలవై లోకానికి తగినవై రాణిస్తున్నాయి. అవి సువర్ణ కిరణాలు. కాసేపటికి అరుణకిరణాలు. మధ్యాహ్నానికి మహోష్ణకిర ణాలు. భూమిమాతకు సువర్ణ ఆభరణాలు. సూర్యుడు సువర్ణమేరుగిరి శిఖరాలను తన తీక్ష్ణకిరణాలతో కరిగించి భూమాతకు బంగారు మలాం పూత పూస్తున్నాడా అన్నట్లున్నాడు.

ఆ సహస్ర కిరణుడు సహస్రవిధాల ప్రజా సహస్రాలకు ఉపకృతి చేస్తుంటాడు.

 

"వ్యోమనాథాయ నమః"

## 99. శ్లోకం

యోనిస్సామ్నాం విధాతా, మధురిపురజితో, ధూర్జటిశ్శంకరోఽసౌ
మృత్యుఃకాలో, ఽలకాయాః పతిరపిధనదః, పావకోజాతవేదాః
ఇత్థం సంజ్ఞా దవిత్థాదివదమృతభుజాం యా యదృచ్ఛాప్రవృత్తా
స్తాసామేవాభిధేయోఽనుగతగుణగణైర్యస్స సూర్యోఽవతా ద్వః

### పద్యం

సామప్రియుండని చతురాననుని పేరు
అజితుండటంచు శ్రీహరికి పేరు
శంకరుండంచును చంద్రశేఖరు పేరు
ఉర్వి కాలుడని మృత్యువుకు పేరు
ధనదుండటంచును త్ర్యంబకసఖు పేరు
పావకుండని అగ్నిదేవు పేరు
ఇవి రూఢిచేత ప్రవృత్తమ్ములైనట్టి
పేరులు మాత్రమ్ముగా రహించు

అన్నిటికి తగినట్టి వా డర్కుడొకడె
సార్థకాఖ్యుడు అరుణుడు అంశుమాలి
వచ్చుచున్నాడు పుత్ర! సత్వరము రమ్ము
నుతి యొనర్పము సుమనో మనోహరముగ !

వ్యాఖ్య

అడుగో! సహస్ర కిరణుడు! ఆయన సహస్రనాముడు. సార్థకాఖ్యుడు దయచేస్తున్నాడు. తత్త్వజ్యోతులు ప్రకాశిస్తున్నాయి.

సామ్రాట్‌ప్రభువు అనే పేరు బ్రహ్మదేవుడికీ ఉంది. ప్రభాకర స్వామికీ ఉంది. అజితుడనే పేరు విష్ణువుకీ ఉంది. వివస్వంతుడికీ ఉంది. శంకరుడనే నామం ధూర్జటికీ ఉంది సహస్రాంశుడికీ ఉంది. కాలుడు అనే ఆఖ్య మృత్యువుకీ ఉంది. జగచ్చక్షువైన సూర్యుడికీ ఉంది. ధనదుడనే అభిధ కుబేరుడికీ ఉంది. విభాకరుడికీ ఉంది. పావకుడనే నామధేయం అగ్నిహోత్రుడికీ ఉంది ఆదిత్యుడికీ ఉంది.

అయితే దేవతకీ పేర్లు డిత్థడవిత్థాదులవలె రూఢిచేత అరూఢములైనాయి. కాని ప్రవృత్తములుకావు. సూర్యుడికి నామాలు ప్రవృత్తిచేత సార్థకాఖ్యలై రాణించాయి. దినమణికివి గుణాగణాలచేత ప్రసిద్ధిపొంది అన్వర్థాలైనాయి. ఆ సహస్రమయూఖుడు మనలను మన్నించి రక్షించుగాక!

★ ★

"పశ్యేం జన్మాని సూర్య"

—సౌరపాఠం

## 100. శ్లోకం

దేవఃకిం బాంధవస్స్యాత్ప్రియసుహృదథవాచార్య ఆహోస్విదర్యో
రక్షాచక్షుర్నుదీపో గురురుతజనకో జీవితం బీజమోజః
ఏవం నిర్ణీయతే యః కిముతి న జగతాం సర్వదాసర్వదోఽసౌ
సర్వాకారోపకారీ దిశతు దశశతాభీశురభ్యర్థితం వః

పద్యం

జగముల కీతండు భగవంతు డాప్తుడు
శాస్త్రమ్ము బోధించు సద్గురుండు
జగముల కీతడాచార్యుండు పూజ్యుండు
ప్రాణమ్ముపోసెడు వైద్యవరుడు
జగముల కీతండు జనకుండు జనయిత్రి
వరములిచ్చెడు ప్రియవల్లభుండు
జగముల కీతండు చక్షువు బంధువు
పావనం బొనరించు జీవనుండు

సర్వులకు సర్వవేళల సర్వమిచ్చు
సర్వకారణం డితడు రక్షకుడు స్వామి
రవి సహస్రమయూఖుండు ప్రాణదాత
ఎల్లవేళల ఆరోగ్య మిచ్చుగాత !

## వ్యాఖ్య

అడుగో! ప్రకాశం విరజిమ్ముతూ వేయి కాగడాల వెలుగులతో వేంచేస్తున్నాడు విభాకరస్వామి. అసలు ఆదిత్యస్వామి ఎవరు? మానవులకేకాక సమస్త చరాచరాలకుకూడ జీవచైతన్యం ప్రసాదించే ఈ సర్వోపకారపరాయణుడెవరు?

జగములకితడు దేవదేవుడా? ప్రాణబంధువా? ప్రియాతిప్రియమిత్రుడా! అజ్ఞానాంధకారం రూపుమాపే ఆచార్యవర్యుడా! మూడు లోకాలకు పూజనీయుడా! సకల జీవకోటికి రక్షకుడా! లేక జ్ఞాననేత్రమా! ఒక విశిష్టమైన ప్రదీపమా! ఎవరు? అజ్ఞానతిమిరం దూరంచేసే జ్ఞానభాస్కరుడా! గురువరేణ్యుడా! మానవులను కన్నతండ్రా! తల్లా! సర్వకార్య కారణభూతుడా! పవిత్ర జీవితమా! అన్నింటి మూలస్థానబలమా!

అని విద్వద్వర్యులు ఎంత ఆలోచించినా అందనివాడు ఆదిత్య సార్వభౌముడు. ఆయన ద్వాదశాత్ముడు. సూర్యనారాయణస్వామి సర్వవేళల సర్వులకు సర్వం ప్రసాదించే జగద్బంధువు. సర్వవిధాల ఉపకారవ్రతం పూని ఉంటాడు. ఈ సహస్రకిరణుడు చరాచరాలకు ఆప్తుడై సహస్రాధికంగా ఈప్సితాలు నెరవేర్చుగాక!

 

"ఆదిత్యా నదితిం దేవీం"

—తైత్తరీయం

## 101. శ్లోకం

చత్వారింశత్ప్రభాయాస్త్రయమథ చ పునర్వాజినాంషట్క ముక్తం
పశ్చాన్నేతుర్ద్విషట్కం పునరపిచ దశస్యందనస్యైకముక్తం
మాయో ఒష్టౌ మండలస్య స్ఫుటమథవ రవేర్వింశతిశ్శ్రీమయూరే
ణేత్థం ప్రాతః పఠేద్యశ్శతకమనుదినం సూర్యసాయుజ్యమేతి

### పద్యం

శ్రీసూర్యదేవాయ ! శ్రితజనక్షేమాయ !
భువనేశ్వరాయ! నమోనమోస్తు!
విశ్వకల్యాణాయ! విశ్వసంసేవ్యాయ !
మునిసేవితాయ! నమోనమోస్తు !
వేదాంతవేద్యాయ! విశ్వవిలోకాయ !
జ్ఞానప్రభాయ! నమోనమోస్తు
ఆదిత్యహృదయాయ! ఆనందనిలయాయ !
మోక్షప్రదాయ! నమోనమోస్తు !

స్వామి! నీ దీప్తిగూర్చి నల్వదియు మూడు -
రథ్యములుగూర్చి ఆరు - సారథినిగూర్చి
పదియురెండు - రథముగూర్చి పదియునొకటి
మండలముగూర్చెనిమిది - మార్తాండుగూర్చి
ఇరువది - మయూరకవి రచియించినాడు
ఆ మహాకవీంద్రునకు ప్రణామశతము !

### వ్యాఖ్య

ఓ సూర్యదేవా! మహానుభావా! భువనేశ్వరా! భువన బాంధవా! నమోన్నమః!

వేదాంతవేద్యా! జ్ఞానప్రదాయకా! మోక్షప్రదా! ఆనంద నిలయా! నమోన్నమః!

నీ దీప్తినిగూర్చి నలుబదిమూడు, నీ అశ్వాలుగూర్చి ఆరు, నీ సారథినిగూర్చి పన్నెండు, నీ రథాన్నిగూర్చి పదకొండు, నీ మండలముగూర్చి ఎనిమిది, నిన్నుగూర్చి ఇరువది శ్లోకాలు మహాకవి మయూరుడు రచించాడు. వారికి నా ప్రణామాలు.

★ ★

"...కర్ణపూరో మయూరః"

—జయదేవుడు



## 102. శ్లోకం

శ్లోకాన్ లోకస్యభూత్యై శతమితిరచితాన్ శ్రీమయూరేణ భక్త్యా
యుక్తశ్చైతాన్ పఠేద్యస్సకృదపి పురుషస్సర్వపాపైర్విముక్తః
ఆరోగ్యం సత్కవిత్వం శ్రియమతులబలం కాంతిమాయుఃప్రకర్షం
విద్యామైశ్వర్యమర్థం పరమపి లభతే సోఽత్ర సూర్యప్రసాదాత్

### పద్యం

శ్రీమయూరకవివరేణ్యుండు ఈ జగ
 చ్ఛ్రేయమ్ముకోరి రచించినాడు
గీర్వాణ భాషలో సర్వులు మెచ్చగా
 శ్రీసూర్యశతకమ్ము ప్రీతితోడ
తెలుగుపద్యాల శాంతిశ్రీ యనేవాడు
 వ్యాఖ్యా సమేతమ్ము వ్రాసినాడు
దీనిని భక్తితో దీక్షతో ఒకసారి
 చదివిన వారికి సంతతమ్ము

సర్వ పాపవిముక్తి - శ్రీచరణభక్తి
ఆయురారోగ్యశక్తి - విద్యారక్తి
సద్యశోబుద్ధి - జ్ఞానవిజ్ఞానవృద్ధి
కలుగ సూర్యదేవుడు దయ తలచుగాత !

వ్యాఖ్య

ఇది మయూర మహాకవి లోకశ్రేయస్సుకోసం రచించిన సూర్యశతకం.

ఆ మహానుభావుడు మహాకవి, మహాభావుకుడు. ఆయన సంస్కృతంలో శ్లోకరూపాలలో సూర్యనారాయణుణ్ణి అనేకానేక విధాలుగా అద్భుతమైన కవితాసౌందర్యంతో వర్ణించాడు.

మయూర మహాకవి రచించిన ఈ సూర్యశతకం అర్థంచేసి కొంటూ పద్యంతో వ్యాఖ్యతో పఠించండి. వీటిని భక్తితో పఠించిన వారు సర్వ పాపవిముక్తులై, ఆరోగ్యాన్ని, సత్కవిత్వాన్ని, సంపదను, సాటిలేని బలాన్ని, కాంతిని, ఆయురాధిక్యాన్ని, విద్యను, ఐశ్వర్యాన్ని, పరమార్థమైన మోక్షాన్ని ఆ సూర్యనారాయణస్వామి అనుగ్రహంతో పొందగలరు.

★ ★

సర్వం శ్రీ సాయీశ్వరార్పణం!

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

